# సువర్ణపత్ర.

గ్రంథకర్తలు,

రామనారాయణ కవులు.








పబ్లిషర్ & ప్రొప్రైటర్,

కాయల కన్నయ్యా నాయుడు,

శ్రీ రామకృష్ణా బుక్కు-డిపో, ఏలూరు.

సోల్ ఏజంట్సు:

కె. కె. పట్నాయక్ అండ్ బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, ఏలూరు-కృష్ణాజిల్లా.

---

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

మా. రాఘవాచార్యులచే ముద్రింపబడినది.

 1925. వెల 1—0—0.

# సుమతీదేవి డ్రామా.

ఇట్టి నాటకరాజము మున్నెవ్వరిచేతను రచియింపబడియుండలేదు. ఇందు కోమలాంగియను వేశ్య తప్పపత్రములు సృష్టించి విటులను మోసగించుట (ఇచ్చట వేశ్యవన్నెగడలు, సురాపానముచే మత్తిల్లి విటులొందు దురవస్థలుఁ జక్కగ వర్ణింపబడినవి.) కథానాయకుండగు కౌశికుండు కోమలాంగివల్ల దరిద్రుఁడై నిజభార్యయగు సుమతీదేవిని పలువిధముల బాధించి, దేశాంతరగతుఁడగుట. (కౌశికుని దుండగములు. సుమతీదేవి పతిభక్తి అసమానము) భగవంతుని ప్రేరేపకత్వంబున, నొక్క మహారణ్యంబున సుమతీదేవి తనభర్తను గలిసికొనుట. సూర్యోదయమగునేని నీమగండు (కౌసికుఁడు) మృతుఁడగునని మాండవ్యమహాముని సుమతీదేవికి శాపంబొసంగుట సుమతీదేవి యాముదులకు ప్రతిశాపంబిచ్చుచుట. ఇమ్మహాపతివ్రత శాపంబునకు వెరచి విష్ణుమూర్తి ప్రసన్నుడై యామెను వేడుకొనుట సుమతీదేవి భగవంతుని యాజ్ఞానుసారముగా సూర్యోదయముగావించుట. విష్ణుమూర్తి యామెప్రభావంబునకు సంతసించి కౌసికునకు దీర్ఘాయువును, సతీపతులకు వరంబులను యొసంగి యంతర్ధానుడగుట వెల 1—0—0 మాత్రమే.

## సతీతులసి.

ఈనాటకమిదివరకెవ్వరును వ్రాసియుండలేదు. బృందయొక్క పాతివ్రత్యము, నామెభర్తయొక్క దుండగములు, జలంధరుని వేషముతో విష్ణుమూర్తి బృందకడకరుగుట బృందస్పర్శనతెని మోహావము. తులసి వృత్తాంతము మొదలగునవి చదివితీరవలయును వెల రు 1—4—0 మాత్రమే.

## హరికథలు.

(శ్రీయుత సందివాడ జగన్నాథకవి విరచితము.)

| | |
|---|---|
| శ్రీకృష్ణరాయబారము | 0—10—0 |
| సీతాకల్యాణము | 0—8—0 |

వలయువారు:— శ్రీరామకృష్ణాబుక్కుడిపో,

ఏలూరు, కృష్ణాజిల్లా.

# సువర్ణపాత్ర.

(Spoiled by Drinking)

గ్రంథకర్తలు,

రామ నారాయణ కవులు.

ప్రకాశకులు,

ప్రొప్రయిటర్ కాయల చిన్నయ్యనాయుడు,

శ్రీ రామకృష్ణా బుక్కు డిపో, ఏలూరు.

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు,

మామిడాల రాఘవాచార్యులచే ముద్రింపబడినది.

1925.



వెల 1—0—0.



# పీఠిక.

ఈ కథ కల్పితము. త్రాగుడు వలనఁ జెడిపోవువానిం గూర్చి వ్రాయఁదలంచి యిట్లు వ్రాసితిని. సాధారణముగా మద్యపాని వేశ్యాలోలుఁడై యుండుటగూడ యుండును. ఆ కారణముచే నిందొక వేశ్య పాత్ర గూడ గల్పింపబడినది. దీనికి సువర్ణపాత్రయను నామమేలయని కొందఱు సందియ మొందవచ్చును. సురాపానమున కలవాటు పడిన శివశంకరుఁడు త్రాగుట కొరకు సువర్ణపాత్రి చేయించుకొనఁగా, నాతనికి దెలియకుండ యతని భార్యయగు సత్యవతి యా పాత్రను దాచి, శివశంకరుఁ డన్నికష్టముల ననుభవించిన పిదప, బశ్చాత్తాపచిత్తుఁడై ప్రాణములు గూడ బాయుటకు సంసిద్ధుఁడైయున్న సమయమున, దెచ్చి జీవయాత్రను గడపుటకిచ్చిన కారణమున నీ పేరుంచబడినది.

ఇట్లు,
గ్రంథకర్తలు.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.



శివశంకరుఁడు—బ్రాహ్మణుఁడు.

రామారావు—శివశంకరుని స్నేహితుడు.

సూర్యనారాయణ—బ్రాహ్మణుడు సుందరికి విటుడు.

పోలిశెట్టి—వైశ్యుడు.

ముకుందశాస్త్రి—శివశంకరుని ప్రాణసఖుడు.

స్త్రీలు.

సుందరి—వేశ్య.

నరహరి—వేశ్యమాత.

మనోరమ—సుందరిదాసి.

సత్యవతి—శివశంకరుని భార్య.





# సువర్ణపాత్ర.



## ప్రథమాంకము.

రంగము.—[మందిరములో సత్యావతి-ప్రవేశము]

సత్య:—(తనలో)

మ. అకటా! వాకిలియొద్దగా నలికిన ♦ ట్లాకాశమున్ మబ్బు క్ర
మ్ముకొనెన్ జీకటికెన్ దిక్కుల; నభం ♦ బున్ వీడి తారాళి ధా
త్రికి నేతెంచె నసంగనా మిణుగురుల్ ♦ రేఁగెన్ బ్రాణేశుఁడిం
టికి రాఁకుండెను గారణంబు నరయన్ ♦ లేకుంటఁ జిత్తంబునన్.

అక్కటా! ఇంతరాత్రియైనను నాథుండు గృహంబునకు రాలేదు. నేనేమి సేయుదును? సత్కుల ప్రసూతుఁడగు నీతఁడిట్టి దురుద్యోగమునఁ బ్రవేశించునని నేఁ గలనైనఁ దలంచియుంటినా?

సీ. నిరతంబు శ్రీమనో ♦ హరుచరణారవిం
దంబులమది నిల్పి ♦ తనరువాఁడు
సకలభాషావిశే ♦ షరహస్యము లెఱింగి
విద్యాధికుఁడయి ♦ వెలయువాఁడు

పరిహాసమునకైన ♦ భావంబులో నన్ను
బొంకఁదలంపక ♦ పొలుచువాఁడు
పరవధూగమనంబు ♦ పాపహేతువటంచు
హితులకుఁ దెల్పుచు ♦ నెసఁగువాఁడు
తే. గీ. అతిథులం బూజసేయుచు ♦ నలరువాఁడు
నాదుప్రాణేశుఁడకట దు ♦ ర్జనులమైత్రి
దగిలి సత్కులగౌరవ ♦ ధర్మములను
వదలియుండెను నేమని ♦ వగచుదాన.

అక్కటా! ఈ పాడు 'సురాపాన' మీయనకెట్లలవడినదో కదా! దుష్టజనమైత్రియేయిందులకుఁ గారణము. సురాపానమునకీయన యలవాటు పడినది మొదలు, కోపము వాగ్ధోరణి ప్రబలినది. ఆయన చిత్తవృత్తి ననుసరించి నేను ప్రవర్తించక పోయితినేని యొడలు దెలియక నన్నుఁ గొట్టుచుండును.

సీ. ఇట్టి దుర్వ్యసనము ♦ కేలయనిన మూన
డాసెనుగా నెంతొ ♦ డాసిపలుక
మధుపానమదిమన ♦ మతిదూష్యమని పల్కి
జెవిఁజేర్పఁడాయెగాఁ ♦ జేరవేడ
త్రాగుబోతులమైత్రి ♦ తగదంచు వచియింప
వినఁడాయెగా యెంతొ ♦ వేడిమ్రొక్క
పెద్దలార్జించిన ♦ విత్తంబు నశియించు
నని యెంచఁడాయెగా ♦ తనదు మదిని
తే. గీ. ఏమిసేయుదునింక నే ♦ నెవరిఁజేరి
వేడుదాన ప్రాణేశు దు ♦ ర్వ్యసనము మాని

పింపుమంచెంత చూచిన ♦ విభున సత్ప
థంబునంబెట్ట నేమియు ♦ దారిలేదు.

పూర్వార్జితంబైన ద్రవ్యమంతయు నానాటికిఁ దగ్గుచున్నది. నే నెంత బ్రతిమాలి చెప్పినను ప్రయోజనము లేకున్నది.

తే. గీ. విమలయశమున ధాత్రిపై ♦ వెలసినట్టి
వంశమున మణిపూసయై ♦ వరలుననుచు
దలఁపఁబడినట్టి నామనో ♦ ధవుఁడెయకట
యిట్టివృత్తిలోఁ జొచ్చె నిం ♦ కేమిసేతు.

అయ్యో! ఒక్కొక్క సమయమున నాథుఁడు గృహమునకేరాక సురాపాన మత్తచిత్తుఁడై సంగడీండ్రం గూడి యందందుఁ జరించుచుండును. ఈ త్రాగుడునకు నలవాటుపడినది మొదలు నా నాథుఁడు తన చరణసేవ నాకు మనస్ఫూర్తిగ నొసంగక యుండెను. (చప్పుడు విని) అడుగుల చప్పుడు వినవచ్చుచున్నది. నాథుఁడు వచ్చుచుండెను కాఁబోలు. (పరికించి) అడుగో? నాథుఁడు.

చేతిలో సురాపాత్రతో.

(శివశంకరుఁడు—ప్రవేశించును.)

శివ:—(తనలో) ఆహా! ఈ సురాపానమహిమ అత్యద్భుతము కదా!

సీ. వివిధమార్గంబుల ♦ వెడలనీకుండగా
మానసంబొకరీతి ♦ మాటుపఱచు
సంతాపదావాగ్నిఁ ♦ జల్లార్చివ్యాయామ్బ
మున నపరిమితన ♦ మ్మదముగూర్చు

చిత్తమందున నింత ♦ చింతయు నెడిమాట
జేరనీకుండ ర ♦ క్షించిమించు
నెట్టికార్యమునైన ♦ నింతలో జేయు దీ
క్ష హృదయమందునఁ ♦ గలుగజేయు

తే. గీ. పిఱికివానికినైనను ♦ భీతిఁబాపి
ధైర్యమునుగూర్చి వెలయించు ♦ ధరణినహహా
మద్యమును వర్ణనముసేయ ♦ మనుజలెక్కి
దరముగాదనిచెప్పంగఁ ♦ దగునుగా వె.

నిశ్చయముగా దీనిని సురలు సేవించుటచేతనే సురయను పేరు వచ్చినది. ఆహా! నాచిత్తమిప్పు డెక్కడనో యున్నది. భూమ్యాకాశంబులు రెండునుగాక, పైనింకొక ప్రదేశమున్నట్లు నాకంటికి గోచరమగుచున్నది. (ఇంచుక ముందుకు నడచును.)

సత్య:—(శివశంకరునిఁ జూచి) మనోహరా! వచ్చితిరా! చీకటిగ నుండుటచే మీరింకను రాలేదని బెంగగొని యుంటిని. ఇంత యాలస్యమునకుఁ గారణంబేమియో యెఱుంగ వచ్చునా?

శివ:—ఏమి! నాయాలస్యమునకుఁ గారణం బడుగుచుంటివా? నీవు నాపై నధికారము వహించఁ దలంచితివా యేమి?

సత్య:—నాధా, క్షమింపుఁడు. చీకటియగుటచే నింత యాలస్యమునకుఁ గారణమేమని యడిగితిని. భర్తయెడల భార్య యీమాత్రపు స్వాతంత్ర్యమునకు నోచుకొని యుండదా?

శివ:—పురుషుల కనేకకార్యము లుండును. అనేక స్థలముల కేగుచుందురు. వాని నన్నిటిని గాంతలకుఁ జెప్పుచుండ వలయునా యేమి?

సత్యా:—పోనిండు. ఎరుగక యడిగితిని క్షమించి యిట గూర్చుండుడు.

శివ:—(ఆసీనుఁడై) ఒక్కచోటనే రెండుదీపములు వెలిగించితివేమి?

సత్యా:—మీకంటి కట్లగుపడుచుండునేమోగాని యక్కడ వెలుగుచున్న దొక దీపమే. (శివశంకరుని చేతనున్న పాత్రనుజూచి) నాధా! అదియేమి?

శివ:—ఇదియా! సుధాపూరిత కాచపాత్ర. రమణీ! దీనిని నీవెప్పుడును చవిఁజూచి యెఱుఁగవు. ఇంచుక త్రావిఁచూడుము. దీని మహిమ తెలియఁగలఁదు.

సత్యా:—నాధా! లోకులచే నతినీచముగఁ బరిగణింపఁ బడుచున్న యీ సురను నంత మహిమ గలదిగా బలుకుటకు మీ చిత్తమెట్లు సమ్మతించినది?

శివ:—తరుణీ! జ్ఞానహీనులు దీనిని నీచముగఁ జూతురు ఇందులోఁ గలిగిన మహిమ మఱి దేనియందును లేదు. సురలు దీనిని సేవించుట చేతనే మరణ రహితులైరి.

మ. మదిరాక్షీమణి! మానసంబును స్థిరం ♦ బైయుండగాఁజేయు,సాం
పొదవన్ సంతసమెంతయుంగొలుపు; లో ♦ వొక్కచింతయున్ బోవనీ
యదు; ధైర్యంబునుగూర్చు; చిత్రమగు వా♦క్యస్ఫూర్తిగల్గించు;గ
ష్టదశన్ దోచగనీయదీసురయునన్ ♦ సామాన్యమే చూడఁగన్.

దీని యనుభవము నీకు లేదు. మోక్షసాధా రోహణమునకీ సురాపానమే ప్రథమ సోపానము. ఏదీ! చిన్నది కాచపాత్ర యొకటి తెమ్ము. దీనినించుక సేవించి మహిమఁ గనిపెట్టుము.

సత్యా:—నాధా! మీరు సేవించుచున్నది చాలక నన్నుఁగూడ యిట్టి దుష్కార్యాచరణమునందేల ప్రవేశపెట్టెదరు (ఇంచుక యూరక

కుండి) మీ పాదసేవకు రాలనగుటచేఁ జెప్పుటకు సాహసించు చుంటిని.

సీ. పదిమందిపెద్దలు ♦ సదమలగుణుఁడని
సంస్తుతించిన గుణ ♦ శాలివీవు
సకల భాషావిశే ♦ షరహస్యము లెఱింగి
విద్యాధికుఁడన ♦ వెలసితీవు
ఇతరులకు సద్బుద్ధి ♦ నింపారఁ జెప్పఁగా
జాలిన మేటి వి ♦ జ్ఞానివీవు
పూర్వార్జితంబైన ♦ భూరిభాగ్య
మనుభవించుచు [illegible] ♦ వెలసితీవు
తే. గీ. పరమధర్మంబు లన్నియు ♦ [illegible]
వర్తిసీవె యీరీతిని ♦ సజ్జనులు
సద్విహీనులు గూడి మధుపా ♦ [illegible]
దగిలి వర్తించు మాడుం ♦ ధర్మముగునె.

నాథా! విఖ్యాతికెక్కిన [illegible] జన్మించిన మహా నీయుఁడవు సమస్త శాస్త్రములు నభ్యసించిన వాఁడవు ఇట్టి [illegible] కార్యమునందు వర్తించుచుండిన నేనేమందును!

శివ:—నే నొనర్చిన యధర్మకార్య మేమున్నది?

సత్య:—ఇంతకంటె నేమికావలయును?

సీ. మతవిరుద్ధంబైన ♦ మధుపానమును ద్రావ
నలవాటుసేయుట ♦ యనుమగాదె
కతురోతగాఁజూడగాఁ ♦ బడు వెలియాఁడ
వీథులం దిరుగుట ♦ వెట్టిగాదె.

అనఘులెల్లరు పరి ♦ హాసమాడంగ దు
ర్జనమైతినంట దో ♦ షంబుగాదె
పెద్దలిచ్చినయట్టి ♦ విత్తమెల్ల వ్రయము
సేయుటయయ్యది ♦ చేటుగాదె
తే. గీ. కటకటా యిట్లుసమధిక ♦ జ్ఞానివైన
నీవె సేయుచుండిన నింక ♦ నేమిసేతు
నీకుఁ జెప్పెడిదాననా ♦ నేను నాథ
వలదు నీవీపనులుసేయ ♦ వలదు వలదు

శివ:—తరుణీ! నేనెట్లున్న నేమి? నాకొకరు పెట్టవలసిన యవసరము లేదు. అదియును గాక నే నెవ్వరికిని నేవిధమయిన యపకార మును జేసి యుండలేదు. నేను వెచ్చించునది నాధనమే.

సత్య:—ప్రాణేశ్వరా! ఇదియా మీరుచెప్పు ప్రత్యుత్తరము. నా పలుకులు సావధానముగఁ జిత్తగింపుడు. మీరు దుర్జనసహ వాసంబునం జేసి యిట్లగుచుంటిరి. కాకున్న మీరుగాని మీ పూర్వులుగాని యిట్టివేషముల వేసియుండిరా? అయ్యయ్యో! యీజుట్టేమి? చేతికినిండుగా ముడిపడు శిరోజముల దీయించి దొరలరీతి నిల్చుంచుట మనకు ధర్మమా?

శివ:—(నవ్వుచు) ఈకాలమున మగనాఁడుట్లన్నియు బ్రాహ్మణ వితం తువుల శిరముల కెక్కుచున్నవి.

సత్య:—నాథా! నీవనినట్లు కాలమట్లే మండిపోవుచున్నది. అయినను మన కొకరితోఁ బనియేమి? మీ పెద్దలెవ్వరైన నిట్లు సురా పానము చేసియుండిరా? అక్కటా! అతినీచమగు నీయలవాటు మీ కెట్లుగలిగినదో కదా! లోకము పరిహాసము సేయుననియైన దలంప కుంటిరేల?

శివ:—నారీ ! ఇంతకును నీవుచెప్పునది సురాపానము నింద్యమనియా చాలు. జాలు.

సీ. సురనుసేవించియే ♦ సురవైరి దేవతా
తతియనువాక్యంబు ♦ దలంపలేదొ
చిత్తజాడ్యాచల ♦ చ్ఛేదనదంభోళి
యిదియనుమాటను ♦ నెఱుగలేదొ
అమృతమునకునై సు ♦ రాసురుల్ పోరుచో
విలసిల్లెనిదియని ♦ వినఁగలేదొ
మాధవునానతి ♦ యాదవుల్ దీని సే
వించినమాట నా ♦ లించలేదొ
తే. గీ. తగునె మధుపానమునకు నిం ♦ ద్యమనిపలుక
దీనిమహిమంబు నీకేమి ♦ తెలయునబల
జనుల సంతతసంతోష ♦ జలధియుంచ
దగినవస్తువు సురకాదె ♦ జగతియందు.

దీని సంగతి తెలియక నీవేమో వెఱ్ఱిపలుకు లాడెదవు. భగవద్ధ్యాన మొనరించువారి కీమధుపానము ముఖ్యముగనుండవలెను. చిత్తమును నన్యథాచలింపనీయదు. మోక్షమంతయు నిందులోనేయున్నది. నేయేల ? ముక్తికాంతా సంగమంబునకీ మధుపానమే తార్పులాడి నిట్టుల ప్రకాశము, వేమనయోగి మొదలగు వారందఱును దీనిచేతనే కృతార్థులైరి.

సత్య:—నాథా ! ఆమహాత్ములకు మనవారే యాకళంకము దెచ్చిపెట్టిరి. అయినను వారియొద్దనున్న మహాత్త్వ మనయొద్దగూడ నుండవలెను గదా !

శివ:—దారికి వచ్చితివి. ఈ సురాపానము మానవుని చిత్తమును వొక్కరీతిగా భగవంతునిపై నిలుపును. దానిచే భక్తుఁడై భగవంతుని వశము చేసికొనును. అప్పుడు మహాత్మునకేమి కొదవ.

సత్య:—ఇట్టి వాక్యములాడుచున్న మీకు నేనేమని చెప్పఁగలను. సురాపానము వలన భగవంతుఁడు వశ్యుఁడగునా?

శివ:—మున్ను సురగురుఁడగు శుక్రాచార్యుడు సురను సేవించుట చెట్టి తనమే యందువా?

సత్య:—నాథా! ఆశుక్రుఁడు సురాపానమత్త చిత్తుఁడైయున్న సమయమునందేకదా, యతని యొద్దకు మృతసంజీవనివిద్య గ్రహించుటకు వచ్చిన బృహస్పతి పుత్రుండగు కచుని రాక్షసులు చంపి కాల్చి యామునిని సురలోఁగలిపి యా శుక్రునిచేఁ ద్రావించిరి. తరువాత నిదియంతయును శుక్రుఁడెఱింగి తన మహిమమున గచుని బ్రదికించి నాటినుండియు సురాపానము దోషముగ శపించెను.

శివ:—అది నిశ్చయముగా శుక్రుఁడు చెప్పినమాటకాదు. అందఱును సురాపానము చేయుదురేమోయని భయపెట్టుటకుఁ బురాణకారులు కల్పించిన శాపమేయది. కాకున్నచో సురాపానము నింద్యమగుటయేమి? (ఇంచుక యూరకుండి) అహా! ఇప్పుడు నేనునెక్కడనుంటినో నాకుఁదెలియకున్నది. అదిగో! నా చిత్తమిప్పుడు భద్రగిరిరామునిపై కేఁగుచున్నది. అహా! ఏమి యుత్సవము. శ్రీరామనవమిరోజున భద్రాచల శ్రీరామచంద్రుని దర్శించి తీరవలయును. ఆ దివ్యమంగళ విగ్రహము దిలకించుటకే రెండుకన్నులును జాలకున్నవి. (భార్యఁజూచి) అటు చూడుము.

సీ. జలజాప్తకులమణి ♦ జామాత యైయొప్పి
నను మనుజనకుండు ♦ హర్షమంద
శ్రీదేవి కెనయైన ♦ సీతకు దగిన భ
ర్తయనుచుఁ దోడికాం ♦ తలు తలంప
తగిన సంబంధ మౌం ♦ ధవ్యమనుచుఁ బంక్తి
రథభూపు చిత్తంబు ♦ రంజిలంగ
అలవసిష్ఠుఁడు మొద ♦ లైన మునీంద్రులు
చేరి ముదమునఁ నా ♦ శీర్వదింప
తే. గీ. శివధనుర్భంగ మొనర్చిన ♦ జేరి సీత
బెండ్లియాడంగ వచ్చిన ♦ పృథ్వీపతులు
సిగ్గుచే నిజపురములు ♦ జేరఁ బోవ
రాఘవుండు సేయు కల్యాణ ♦ రాముఁ డొప్పె.

వహ్వా! ఏమి యుత్సవము ఈ పుణ్యమంతయు రామదాసుది. పూర్వము తానీషాయొద్ద భద్రాచలము తహశీలుదారుగనున్న రామదాసు కట్టించినదే యీ యాలయము. ఈ ప్రాకారములు ఈ గోపురములు, (ఇంచుక యూరకుండి) శ్రీరామ కల్యాణ సమయమున నావేశ్య లెట్లాడుచున్నారో! ఓహో! వారి యభినయము వర్ణనాతీతముగ నున్నది. నాయకురాలు గుంటూరు రంగనాయకియా యేమి? ఇది మొన్న జమీందారుగారు దీనికి వసంతోత్సవ సమయమున స్వహస్తములతో రంగు పూసినారు. దీనిముఖము జూడఁగనే నేను మను చరిత్రలో చదివిన,

మ. అతఁడా వాతపరంపరా పరిమళ ♦ వ్యాపారలీలన్ జనా
న్వితమచ్చోటను జేరఁ బోయి కనియెన్ ♦ విద్యుల్లతాంగిగహాన్

శతపత్రేక్షణఁ జంచరీకఁ జగురన్ ♦ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్................. ♦ నారీశిరోరత్నమున్.

అను పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది.

సత్య:—(తనలో) ఈయన వాగ్ధోరణి యధిక మైనది. నే నీ సమయమున నేమి చెప్పినను చెవికెక్కదు. ఔరా! ఈ మద్యపాన మెంతపనిఁ జేయును?

మ. ఒకవేళన్ దనుతానె నవ్వఁగను జే ♦ యున్; శోకమున్ బొంద నిం
కొకవేళన్ బొనరించు; నొక్కఁ డెలిఁ జే ♦ యునే గోపిగా నింకనొ
క్కొకకాలంబున దుష్ప్రలాపిగను జే ♦ యున్ మద్యపానంబు రో
యక నై కొందు రిదేమి కారణమొ యయ్యా ♦ హా! పీనిభావింపకే.

ఈయనకు నెమ్మదిగా భోజనముపెట్టి శయనింపఁ జేయవలయును. (ప్రకాశముగా) నాథా! ప్రొద్దుపోయినది. భోజనమునకు లెండు.

శివ:—భోజనమా! నీ వెవరవు?

సత్య:—నేను నీ యిల్లాలిని. మీచరణ సేవకురాలను.

శివ:—ఓహోహో! అవునవును. నా గృహదేవతవు మరచిపోయితిని.

సత్య:—నెమ్మదిగా లేచి మడి గట్టుకొనుఁడు (లోపలికి తీసికొని పోవుచున్నది.)

రంగము:—2 [శివశంకరుని గృహము, ప్రవేశము, శివశంకరుఁడు.]

శివ:—(తనలో) మధుపానమున కుపయోగించుటకు సువర్ణపాత్ర సేయుమని చెప్పి, యందులకుఁ దగిన బంగారు మొసంగి నేటికి మాసము దినములయినను నాపీరాచారి యింతవఱకును దానిం జేసి తీసికొనిరా డయ్యెను.

తే. గీ. రజకుఁ డుతుకఁగఁ గొన్న వ ♦ స్త్రములు విశ్వ
కర్మ చేయఁగాఁ గొన్న న ♦ గయును; ఋణము
గొన్న ధనమును నిచ్చెద ♦ మన్ననాటి
కీయబుద్ధి జనించ ద ♦ దేమికతమొ.

[ప్రవేశము:—సూర్యనారాయణ]

సూర్య:—(తనలో) నిశ్చయముగా నా సుందరికి నాయందెంతో వలపు కాని యప్పుడప్పుడు దాని తల్లియగు నరవారి కారణమున నన్ను ధనమునకై బలవంతి పెట్టుచుండును. నాశక్తి వంచన లేకుండ వీలగునంత వఱకు నేకొంతయుఁ గలుగకుండఁ జూచుచునే యున్నాను. అదియేమి కారణమోగాని, వారము రోజులనుంచి యావృద్ధ వేశ్య నన్ను ద్రవ్యమునకై గ్రహము బాధించు విధమున బాధించుచున్నది. ఇదిగో! అదిగో! యని నేనును గాలము వెళ్ళఁబుచ్చుచుంటిని. ఇంక నెట్టియునఁ గొంచె మైన సొమ్మియ్యక యున్నచో గౌరవము దక్కదు. ఇప్పుడు నేనేమి సేయుదును. ఈ శివశంకరుని నేనేవిధముగా ఋణ మడుగుదును.

సీ. మొన్న నేకద రెండు ♦ పుష్టికరమునకు
బండుపోలము ఖర్చు ♦ పఱచినాను
కట్టంబునకు బెండ్లి ♦ కాలమందిచ్చిన
యంటు మామిడితోట ♦ యమ్మినాను
పూర్వార్జితంబైన ♦ పూరికొంపను గూడ
వెలస్వల్పమున కిచ్చి ♦ వేసినాను
అల విజయదశమి ♦ కత్తవారిచ్చిన
హేమపాత్రను విక్ర ♦ యించినాను

తే. గీ. చేలిమురుగులు తోడాలు ♦ చిగురుబోడి
పట్టుచీరకుఁ దాకట్టు ♦ బెట్టినాను
తుదకు గడియారమునకుండి ♦ ముదముగూర్చు
గొలుసునుంగూడ నమ్మితి ♦ గలికి కొఱకు.

(ఇంచుక యూరకుండి) ఎట్లయినను రెండుమూడు దినములలో సుందరికి సొమ్ము తెచ్చియిచ్చెదనని చెప్పినాను (ఆలోచించి) కానిమ్ము ఇప్పుడీ యాలోచన మేల? శివశంకరుఁడు తక్కిన గుణము లెట్లుండినను సరసుఁడు. (శివశంకరుని సమీపించును.)

శివ:—ఓహో! సూర్యనారాయణయా యేమి! హితుఁడా! రమ్ము. ఇటఁ గూర్చుండుము.

సూర్య:—(ఆసీనుఁడగును.)

శివ:—సూర్యనారాయణా! నీవేదియో కార్యార్థమై వచ్చితివని తలంచెదను.

సూర్య:—విశేష కార్యమేమియును లేదు.

శివ:—ఏదియైన నెఱుంగఁ వచ్చునా?

సూర్య:—సరిసరి. నీకొఱకరుదెంచి వచ్చినపని చెప్పకుండ నేపోవుదునా.

శివ:—మిత్రమా! అడుగుటకు మఱచితిని నిన్నుఁ జూచినంతనే జ్ఞాపకమునకు వచ్చినది. ఈ మధ్య ననవసరముగా రెండువందల రూప్యములు నష్టమైనవని వింటిని. అది నీకొక మహాత్ముఁడీయు మిత్రుని వలన సంభవించినదని వింటిని. నిజమేనా?

సూర్య:—(తనలో) ఈ సంగతి యీతనికిఁ గూడఁ దెలిసినది (ప్రకాశముగా) శివశంకరా! జరిగిన దానికి విచారించినందు వలనఁ బ్రయోజన మేమున్నది. స్నేహమునఁ జేసి నా మిత్రుఁడగు

హనుమంతరావు నాకొఱకుఁ దానొకచోట దనపేరనే పత్రము వ్రాసి యాసొమ్మును దెచ్చినాఁడు. అతఁడా సొమ్మును నాకై తెచ్చుచున్న సంగతివిని నాతోనింతకుపూర్వమెక్కువమైత్రితో వర్తించుచున్న యాతురుష్కుడు దారియందు గాచి హనుమంతరావు చేతనున్న యా ద్రవ్యమును బలవంతముగఁ గొని పోయినాడు. దానివిషయమై నేనుతగినచర్య దీసికొనక, నాకై తెచ్చిన కారణమున యాధనము హనుమంతరావునకు నేను పూర్తిచేసితిని.

శివ:—మిత్రమా! రసికదా ప్రకటనార్థమై కర్తపురము నుండి "అమ్మడు"అను నామాంతరము గల సుందరియను వేశ్యయు వతినిదెచ్చి యుంచితివని వింటిని. దానికేమి, సంతోషమేకాని, నీ వెంటనెప్పుడును దిరుగుచుండు హితులు మాత్రము నిష్కల్మష హృదయములతో లేరనివింటిని. వారునీచేత ధనము ఖర్చుపెట్టించుటకును వారి స్వలాభము జూచుకొనుటకును, నిన్ననుసరించి తిరుగుచుండిరని నీవ్రు గహించియే యుందువు.

సూర్య:—శివశంకరా! ఆ స్నేహితుల విషయమై మొదటనాకుఁ దెలియలేదుగాని, క్రమక్రమముగాఁ దెలిసినది. అంతట నెమ్మదిగా వారిమైత్రినిఁ జాలించితిని.

శివ:—వుయ్యూరు ప్రాంతముననున్న పొలము నీవు విక్రయించెద నన్న సంగతి నాకుఁ గొంచెమైనను దెలుఁగ జేసియుండ వైతివి. పత్రమునందు మాత్రము మూడువేల రూప్యములకు విక్రయమని వ్రాసికొనిరనియు, క్రయదారునియొద్ద నీవు పన్నెండు వందలరూప్యములు మాత్రమే పుచ్చుకొంటివనియు, ఆసొమ్మై

నను నీకుఁ బూర్తిగారాక, నీవెంటనున్న స్నేహితులు కొంత కైంకర్యము జేసిరనియు వింటిని. అసొమ్ములో మాత్రము నీవు వేశ్యకై రంగరాయుని యొద్దగొన్న పట్టుబట్టల ఖరీదు నాలుగువందల రూప్యములు మాత్రము ఖర్చు గనిపించు చున్నది.

సూర్య:—కొన్నికొన్ని చిల్లర ఋణములఁగూడ దీర్చితిని. (తనలో) ఈతఁడిప్పుడీ సంగతులన్నియు ననవసరముగా నెత్తుచున్నాఁడు. నేనిప్పుడీతనిని ఋణమడిగినచో నేమైన సంశయించునేమో (ఆలోచించి) కానిమ్ము మాగ్రామమున నింకను నాకున్న పొలమున మూడు యకరముల ఖండము విక్రయింపఁ దలంచి తినని చెప్పెదఁ గాక.

శివ:—మిత్రమా! నేనివి యన్నియు నడిగితినని నీవు మఱియొక విధమునఁ దలంప వలదు సుమా!

సూర్య:—అట్లెన్నటికిని, దలంపవలదు.

శివ:—ఆమాటలకేమి? ఇప్పుడు నీవు వచ్చినపని యేమి?

సూర్య:—మాగ్రామమున నాకున్న మూడు యకరముల పల్లపు భూమి విక్రయించ దలంచితిని. ఈ విషయమున నీవేమైనఁ జూచెదవేమో యని వచ్చితిని.

[రామారావు-వీరాచారితోఁ బ్రవేశించును.]

శివ:—(రామారావును జూచి) వీరాచారిని తీసికొని రాగలిగితివి. (వీరాచారినిఁ జూచి) ముత్తెముమీద యేవస్తువు నైనను ననుకొన్న దినమునకుఁదెచ్చి యియ్యవుకదా!

**వీరా:**—పంతులుగారూ ! మీరట్లనిన నేమందును. ఈగిన్నెకు నగిషీ చేయుట యాలస్యమైనది. చూడండి సామాన్యపువని పట్టినదనుకొనిరేమో !

(సువర్ణపాత్ర నిచ్చును.)

**శివ:**—(చూచి) ఆలస్యమైనను పని బాగుగనే యున్నది.

**వీరా:**—మజూరి చాలదు.

**శివ**—దానికేమిలే. తరువాత చూడవచ్చును.

**రామా:**—వీరాచారీ ! నీవు సాయంసమయమున రమ్ము.

**వీరా:**—మంచిది. (నిష్క్రమించును.)

**రామా:**—(సూర్యనారాయణ నుద్దేశించి) ఇపుడో ! సూర్యనారాయణ యేదియో పనిమీద వచ్చినాడే:

**శివ:**—ఈతనికిఁ దన గ్రామమునసున్న మూడు యకరముల భూమిఁ నమ్మెనట. మనము పుచ్చుకొందమా ?

**రామా:**—నీకు పొలముమీద మనసు పుట్టినదేమి ?

**శివ:**—వీలుగనున్నచో మనము గైకొందము.

**రామా:**—సరే. ఈవిషయము రేపాలోచింతముగాక. (సూర్యనారాయణను జూచి) మిత్రమా! అమ్మదలంచినచోఁ గొనువారనేకులుందురు. కాని యొక్కవిషయము మాత్రము సంశయము. వెనుక నీవుపొలము విక్రయించినప్పుడు నీవు యుక్తవయస్కుడవు గావనుసంగతి యొకటి వచ్చినది. ఈ విషయమై మనము పూర్తిగ నాలోచించ వలసియున్నది.

**శివ:**—రేపు చూచెదను.

**సూర్య:**—(తనలో) ఓహో ! ఈ యాటంకము గలిగినదే.

రామా.—శివశంకరా! నే నింకను భోజనము సేయలేదు. పోయి వచ్చెదను. (సూర్యనారాయణతో) మిత్రమా! రమ్ము.
ఇరువురును (నిష్క్రమింతురు.)

శివ:—(సువర్ణపాత్రను జూచుకొనుచు) వీరాచారి తన నేర్పంతయు నీ గిన్నె చేయుటలోఁ జూపినాఁడు.

తే. గీ. మహితసత్కవి రచనా చ ♦ మత్కృతియును
ప్రౌఢిజూపించు నగసాలి ♦ పనితనంబు
జిత్రకారుని శక్తియుఁ ♦ జెప్పదరము
గాదు; జగముస్సృజించిన ♦ కర్తకైన.

ఈపాత్ర నా సంతోషమునకుఁ దగినట్లున్నది. ఇది నాభార్యకుఁ జూపెద గాక! (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

---



# సువర్ణపాత్ర.



## ద్వితీయాంకము.

రంగము:—[సుందరి గృహము:—ప్రవేశము:—సుందరి—నరహరి.]

నర:—అమ్మాయీ! నీకు నేనెంత చెప్పినను ప్రయోజనములేదు.

తే. గీ. బిచ్చగానికినొక యూరు • వెలవెలంది
కొక్కవిటుడనంచును గమ • నోద్యమందు
వ్రాసినా యెచ్చటనునైన • వారిజాక్ష
వినకయుంటివి నామాట • వెఱ్ఱివగుచు.

ఆ శక్తిపురములో నేదోవిధముగా సుఖముగాఁ గాలము గడుపుచున్న మనలను ఆ సూర్యనారాయణ నీ విజయపురమునకు చేర్చినాడు. సరే దానికేమి? చేర్చినందుకుఁ తన యొద్దనున్నంత వఱ కేదోవిధముగా నిచ్చినాడు. ఆతని యొద్దనున్న ధనమంతయు నయినది. ఇంక నాతనిని మనము బాధించినందు వలనఁ బ్రయోజనము లేదు. ఇక నాతనికి నెమ్మదిగా స్వస్తి చెప్పినఁగాని వీలుపడదు. ఎంతవఱకని వానిని నమ్ముకొని యుందుము. అదియునుగాక, మొన్న రాఘవ

రావు అను ఆ బ్రాహ్మణ కుఱ్ఱవాడేదో పనిమీద మేడమీదవున్న "వరసింహము" కొఱకు వచ్చి, నీతో మాట్లాడఁగా అనుమానపడి మన యింటికెవ్వరు రాకూడదని వెఱ్ఱికేకలు వేసెను. వేశ్యలమగు మనమొకరి యాధీనము క్రిందఁ బడియుండు నవసరమేమి వచ్చినది. ఇంక నీ పీతని విషయములో నుపేక్ష సేయ వలదు. ఈ దినమున నీ వాతనితోఁ గట్టిగాఁ జెప్పకుంటివేని, నేనే జెప్పెదను.

సుంద:—అమ్మా! నేనును నీవు చెప్పిన విషయమును గూర్చియే యాలోచించుచున్నాను. కాని, నావిషయమై యంతధనము వెచ్చించిన యాతని కింతత్వరలో యుద్వాసనఁ జెప్పఁటకుఁ గొంచెము సంశయించుచున్నాను.

తే. గీ. వెలవెలదియే యగునుగాక ♦ వలపుచేత
దనకునై లెక్కలేనట్టి ♦ ధనము వెచ్చఁ
జేసినట్టి విటుని నిట్లు ♦ జేసెననెడి
సడికి నొక్కింత మదిలోన ♦ జడియుచుంటి.

సీ. అల వినాయక చవి ♦ తెంచు వచింపఁగా
మెచ్చఁగాఁ గాసు లం ♦ దిచ్చినాడు
కట్టుచీరలకునై ♦ కడునల్కబూనఁగా
బొలమమ్మి ద్రవ్యంబు ♦ బోసినాడు
గౌరీవ్రతంబన్న ♦ కడు మోదమునుబూని
వేశ్యవిందులు జరి ♦ పించినాడు
సంకురాత్రియటన్న ♦ సరసులు తలవంచ
గుప్పగా ధనమ్మును ♦ గుఱిపినాడు

తే. గీ. ఎప్పుడెయ్యది కోరిన ♦ నప్పుడెచ్చి
డైన బహువిధంబులనన్ను ♦ నరసినాఁడు
ముందువెనుకల నరయక ♦ పొమ్మటంచు
వానితోనెట్లు బల్కుదు ♦ భయము విడిచి.

వర:—బాగున్నది. ఇటువంటి భయము, సంశయము, సన్నచో మన వృత్తి సాగునా? మన వృత్తికి ముఖ్యసాధనము మొగమోటము లేకుండుటగదే.

ఉ. ఒక్కని బిల్వనోను మఱి ♦ యొక్కనితోడ రమింపనోను నిం
కొక్కనిఁజేర్పనోను మఱి ♦ యొక్కని యాతలమందు నింటిలోఁ
బ్రక్కఁగదిన్ ధనాఢ్యమయి ♦ వారసతీమణియిట్లు చేసినన్
దిక్కులఁగీర్తి డిండిమ ప్ర ♦ తిధ్వనలీయఁగ మ్రోఁగుఁబ్రతికా.

ఇంకను నీవు చిన్నదానవు. దీపముండఁగనె చక్కఁబెట్టుకొన వలయునని పెద్దలు చెప్పినారు.

తే. గీ. వయసుముదరకమున పై ద్ర ♦ వ్యంబుగూర్చి
యుంచి వార్ధకంబున గాల ♦ మొక్కరీతి
సుఖముగాఁ బుచ్చవలె గాదె ♦ సుదతి నీకు
తలనెరసినేని యెవ్వాఁడు ♦ దగులుమాల.

నీ వతనితోఁ జెప్పుటకు సంశయముగా నున్నచో నాపనికై నన్ను విడువుము. ఇంక వీనివలన మనకులాభములేదు ఈతఁడు తనకున్న పొలము మొదలగునవి విక్రయించి బాల్యచాపల్యమున మోహమున బడి నీకిచ్చుచున్నాడుగాని, యార్జనశక్తి యేమియు లేదు. రసికుఁడా యన్నయట్టి రసికత యేమియు లేదు. ముక్కుపచ్చలారని నిన్న మొన్నటి కుంక. గౌరవమేమయిన నున్నదా! అదియును లేదు. లబ్బేసాహేబు

వలెనొక గుడారుకట్టుకొని పోవునప్పు డీతని యనుచరులగు మహావ్య దీయమిత్రులు, పటమందిలోనైనను "అరే! వుయ్యూర్ పంతుల్" అని కేకలు వేయుచు బిలుచుచుందుట నీవెన్నిసారులు వినలేదు? పోనిమ్ము ఏగంగలోఁ గలిసిన మనకేమి? మనకు ద్రవ్యమే ప్రధాన మనుకొందము అదియు నెలదినములనుండి పూజ్యమైనది. ఇంటి అద్దెకే యీతఁడదిగో యిదిగో యని చెప్పుచున్నాడు పోగామిగిలినది యీతని గ్రామములో నింకను కొద్దిగా పొలమున్నది అది విక్రయించుగాక! ఆసొమ్ములో యీతనివెంట దిరుగు దుష్టచతుష్టయము కొంత పెరు మాళ్ళఁగింపు చేయును. మిగిలినది బాకీలకుపోవును. సున్నకు సున్న హళ్ళికి, హళ్ళి. ఆకేఁడు ముగులును ప్రతి ఫలరహితముగ నీవాతనిని రానిచ్చుచుందువా చక్కఁగ వచ్చి పోవుచుండును. అందుకేమియు లోపముండదు. కాని మన వేశ్యలలో నెవ్వరును ప్రతిఫలా పేక్ష లేక యిట్టి కార్యములకు దొరకొనరు. ఒకవేళ నీవు "సిం హాయి" విషయ మడిగెదవేమో! అది యంతయు మాయ. ఆ బ్రా హ్మణునియందు దనకు "మోజ"నియు, నతనిని దప్ప నితరులను జూడదనియు వారు వీరను కొందురుగాని యది వట్టి కల్ల. అట్టి బెట్టు సరిమాటలఁ జెప్పుచున్నచో విశేషముగా ధనమిచ్చి యెవ్వరైనవత్తు రని దాని యభిప్రాయము. మన మెన్నిసారులు యెవరో ప్లీడరుగారు దీని యింటికి వచ్చుట చూచినాము.

(సూర్యనారాయణ—ప్రవేశము.)

సూర్య:—(తనలో) ఎక్కడకు వెళ్ళినను, నీవు యుక్తవయస్కుడవు కావు. నీకు విక్రయించుటకు హక్కు కలదో లేదో యను సంశ యము బాధించుచున్న దని ప్రతివారును చెప్పసాగిరి. ఇంతకు

మున్ను నేను కొన్ని పొలములు విక్రయించిన సంగతినిగూర్చి చెప్పినను నే నమ్మదలంచిన భూమినిఁ గొనుటకు వారేదో యాటంకము గలిగించుచునే యుండిరి. పోనిమ్ము. ఈపురమున గాక మఱియొక పురముననైనను నీ విషయమై యాలోచించ వలయునని, నర్సారావుపేట హనుమంతరావును వెంటబెట్టు కొని వెళ్ళగా నక్కడివారు భూమిఁగొను విషయమై తరువాత నాలోచించెద మనియు, ప్రస్తుతము వారిమునిసిపాలిటిలో రెండు మూడు వందల రూపాయలు తాకట్టుమీద నిచ్చెదమనియు, నదియునైన హనుమంతరావు మధ్యవర్తిగానుండి యాతనిపైఁ గూడ పత్రము వ్రాయవలయుననియుఁ జెప్పినారు.

తే. గీ. ఏయుపాయముచేసైన ♦ వృద్ధవేశ్య
కాగ్రహం బొదవకయున్న ♦ యసనసత్తె
మాయవలె లేకయున్నన ♦ స్నిగ్ధనెనల
నడచుటయె సత్యమని మదిన్ ♦ దలఁచువాఁడ.

(ఇంచుక యూరకుండి) ఎట్లో నాలుగు రోజుల నడుకును నెమ్మదిగాఁ గాలయాపనము సేయుచు భూమి విక్రయమునుగూర్చి యుంకను నాలోచించెద గాక. (నెమ్మదిగా ముందుకు నడచును.)

నర:—(సూర్యనారాయణను జూచి) ఓహో! అల్లుడుగారా! దయ చేయండి.

సూర్య:—(తనలో) ఈ వృద్ధవేశ్య యిచ్చటనే యున్నదే?

తే. గీ. ఫలమహీరుహంబులముందు ♦ వగలు ముంగల
కంచెలవితాన ; నృపగృహం ♦ గణమాముందు
భటులచాడ్పున, సుందరు ♦ వారసతుల
గృహములందుఁ గ్రూరమతులౌ ♦ వృద్ధసతులు.

విటులపాలిటి కీవృద్ధవేశ్యలు మృత్యుదేవతలని చెప్పనొప్పు. (ప్రకాశముగా) ఎన్నడునులేని దయం జూపుచుంటివి. కారణమేదో యుండవలెను.

నర:—మీయందు మే మెప్పుడయిన నన్యథా చరించితిమా! యేమి? (సుందరినిం జూచి) ఏమే! పంతులుగారువచ్చి నిలంబడి యుండంగా నీవు లేవవు. ఇంతవఱకు మర్యాద తెలియలేదు.

సుంద:—వారి గృహములో నేను వారికి మర్యాదచేయవలయునా? (సూర్యనారాయణను జూచి) ఈలా దయచేయండి.

సూర్య:—(కూర్చుండును.)

నర.—(తనలో) ఈతని మొగము "సంతకు" వెళ్ళివచ్చినట్లు యున్నది. దీనింజూడ సామ్ముకొ్కడను సానుకూల పడలేనివిధముతోచుచున్నది. (ప్రకాశముగా) అల్లుడుగారు మిగుల విచారించు పగిది చూపట్టుచున్నది.

సూర్య:—(తనలో)

తే. గీ. ఆవరించిన ప్రేవుల ♦ నరయంజాలు
వృద్ధ; యిది, నా మొగముంజూచి ♦ యిట్టెయెఱుగ
జాలె నాదీనభావంబు ♦ సమయమునకు
నేమినచియించువాడను ♦ నేమిదారి.

ప్రస్తుతము దీని కాగ్రహ మొదవకుండ నేదోవిధముగాం జెప్పవలెను. (ప్రకాశము) నరిహారీ! నీవు సామాన్యవు దానవుకావు. ముందుకాళ్ళకు బంధములేయ నేంచుచుందువు.

నర:—ఎంతమాట సెలవిచ్చితిరి. మీ వేళాకోళపు మాటల కేమిగాని మీరు వెళ్ళిన పనియేమనదా?

సూర్య:—ప్రస్తుతము కాలేదు. కాని నాలుగైదు దినములలో నగును. అన్ని యేర్పాటులను జేసి వచ్చితిని.

వర:—రెండుమాసముల నుండియు మీరు చేయని యేర్పాటేలేదు. మామూలతున మీకుఁ జాలకష్టముగ నున్నది. ఈ విషయ మునుగూర్చి నేనిదివరకే సెప్పియున్నాను. ఇట్టి సందర్భములు మీకు నేను చెప్పలేక చెప్పుచున్నాను. మిమ్ముసమ్మకొని యేగదా మేము కర్త్రిపురము నుండి యీ విజయాపురమునకు వచ్చితిమి. వచ్చినందుకు మీకు శక్తియున్నంత వఱకు మిమ్ము గనిపెట్టినారు. మీరు మా అమ్మాయి కిచ్చిన సొమ్ము నేము మియు మాటలు గట్టి యటుకకై నెక్కించలేము. పొట్టకేకరి పోయినది. తక్కిన వేశ్యలవలె మేమును ప్రవర్తించుచున్న యెడ మాకే యిబ్బందులుండవు; కాని యట్లుగాక మా అమ్మాయి మిమ్ముల నేనమ్మి యున్నది.

సూర్య:—ఇప్పుడు నేను నీతనూజ విషయమై చేసిన లోపమేమి యున్నది?

తే. గీ. ఎప్పుడెయ్యది వలసిన ♦ నప్పుడదియె
తెచ్చి యిచ్చుచుండుట నీకుఁ ♦ దెలియదొక్కొ
తెలిసియుండియు నీరీతి ♦ బలుకఁ దగునె
లోపమున్నదె చెప్పుమీ ♦ దాపనేల.

సీ. మొన్న మొన్న నెకదా ♦ ముత్యాలపేరుకై
యెంతయోద్రవ్యంబు ♦ నిచ్చినాను
బంధుభోజనమంచు ♦ వచియించి నాగళం
బున హారమునునమ్మి ♦ పోసినాను

చీరలు లేవంచు ♦ చెప్పంగఁ జాలమమ్మ
విరిబోడికి ధనంబు ♦ గురిపినాను
తోడికాంతలఁ జూచి ♦ తోడాలు కావలె
నంచు వచింపఁ జే ♦ యించినాను

తే. గీ. నాగరంబునఁ బుదుచేరి ♦ నాన టన్న
జేతవిత్తమ్ములేకున్న ♦ జేరియొకుల
యొద్దనప్పునఁ గొనితెచ్చి ♦ యువిద ముదము
నందఁగోర్కెలన్నియు దీర్చి ♦ యలరినాను.

సాధ్యమగునంతవఱ కెట్టికోపము గలుగకుండనే చూచు చుంటిని.

సుంద:—మీరుమమ్ము సాకుటలేదని యెవరు చెప్పినారు. మాఅమ్మ యేదో తెలివి తక్కువ మాట పలుకు చుండును.

నర:—నేనమ్మాత్రి మేనుంటిని. ఉన్నసంగతిఁ జెప్పితిని. (సూర్య నారాయణను జూచి) పంతులుగారూ! మీకుఁ గోపము వచ్చినదా! మామూలమున మీకీ శ్రమపడుట యెందుకు? మీవలన మాకు అపనిందకిన్న మరేమియు లేదు. మీవారంద అను సొమ్మంతయు వేశ్యకుఁ బెట్టుచుంటివని పలుకుచుండిరి గాని నిజము గనుఁగొనలేక యున్నారు. మీ వెంటనంటి తిరుగు దుష్టగ్రహముల వలన మీ సొమ్మంతయు వ్యయమగు చున్న దని వారెఱుంగలేక యున్నారు. ఈగోలంతయు మాకెందుకు? చూచినవ్వాళ్ళు చూచిరి. మీరును నిబ్బందిలోనే యున్నారు. మాకుడబ్బులేసి డయుకినిముస మీయూరఁగడవదు. వెచ్చము లకోమటియు, అప్పిపమయ్యమై యింటివారును పలికిన పలుకు

లను నుడువఁదరముగాదు. ఇంచుక గట్టిగామాట్లాడిన మీకా గ్రహంబొదవును.

సూర్య:—నరహరీ! మంచిచెడ్డలరసిన నీవేయిట్లు పలుకుచుండిన నే మందును. ఇబ్బంది యనునది యెప్పుడును నుండునా? నేను సర్వవిధములఁ బ్రయత్నము సేయుచున్నాను. తుదకు నాకు మాగాణిలోవున్న కొంతపొలము విక్రయింపఁ దలఁచినాను. ఆవ్యాపారము నాలుగైదు దినములలోనే జరుగును. తరువాత మనకు ధనమునకేమి కొఱఁత.

నర:—మీరు మాసము దినములనుండి యిట్లే చెప్పుచున్నారు. కాని కార్యము మాత్రము జరుగుటలేదు. మీకు మా అమ్మాయి ముగముజూచిన వేళావిశేష మెట్టిదో యది మిమ్మిడ బాయలేకున్నది. చెప్పఁగూడదుగాని, యెంతమంది పెద్ద మనుష్యులు, వారి పేరుల నేల బయలు పెట్టవలయు? అమ్మాయికై వార్తల బంపిరి. వారి వార్తలన్నియు, దృణప్రాయముగఁ జూచినది. ఇందులకుఁ గారణము మీ యందున్న మోహమే కదా.

సూర్య:—నీ తనూజయందు నాకు మోహము లేకపోయెనా యేమి?

తే. గీ. పుష్పవతియయ్యె నీ భార్య • పొలఁతిమిన్న
యనుచు నెన్నెన్నొ వార్తల • సత్తివారు
పంపినను బోవకుంటి నీ • పట్టి విడిచి
గరిత! మోహమేకద దీని • కారణంబు.

ఈ సంగతులన్నియు నీకు మాత్రము తెలియకున్నవా?

నర:—తెలియకేమి? యుక్తవయస్కురాలై యున్న మీ భార్య యొద్దకు మీరరిఁగితిరేని, మాకును నీకష్టములుండవు. మీకును

మామూలమున శ్రమయుండదు. మీరాఅమ్మాయి నెడఁబొరపు జాలకయుంటినని మీరు వచించినందువలన ఏమి ప్రయోజనము.

సీ. దొరలకెల్లను మించి ♦ వరలు నీ "కార్పింగు"
నాదువృత్తికకు బం ♦ గార మగునె
లబ్బైవా హేబుబోలు ♦ నిబ్బరంబగునీదు
గూడకట్టుసతిలకు ♦ మేడయగునె
నన్నగాసితెల ♦ సన్నగా నొనరుగు నీ
బుజసమ్మతిపెసతికిఁ ♦ గోకలగునె
ఇదిగో తెచ్చెద ధనం ♦ బిదిగొవచ్చెనను నీ
యుక్తి వాక్యములు మాకు ♦ భుక్తియగునె

తే. గీ. మిమ్మునమ్మిన మాకు ధ ♦ నమ్ముకొఱత
వడక యుండ నీయక యున్నఁ ♦ గడచునెట్లు
ధనములేకున్న వారికా ♦ మినుల పొందు
గలుగదందురు నీమది ♦ దెలియదొక్కొ.

సుంద:—(తెనుఁగో) ఈమె యనవసరమైన మాటలాడుచున్నది. పంపి వేయుఁదలఁచి నప్పుడు తెగినకట్టిని చల్లని మాటలతోఁ బంపక యిట్టివన్నియు నెందుకు? (ప్రకాశముగా) అమ్మా! అల్లుడు గారితో చెప్పుదును హాస్యమేనా నీవు వశస్యమున కందువ్ల వారు నిజమని తలంచి కోపముఁబూనెదరు. (సూర్యనారాయ ణనుఁజూచి) పంతులుగారు! మాయమ్మ మాటలు మీర పాటి సేయకుఁడు.

తే. గీ. వయసుమీరిన కొలది కో ♦ పంబు హెచ్చు
ననెడి సామెత కనలేదె ♦ యందు నల్ల

మందుపిచ్చి మాయమ్మకు ♦ నగుటచేత
దాని మాటలుపాటింప ♦ దగదుమీకు.

(తల్లినిఁజూచి) ఇఁకజాలుకే ఈమాట లనుటచేత నీవు గొప్ప దానివైతివి కాబోలు. అనవసర సంభాషణసేయ వలదని నీకెన్ని సారులోఁ జెప్పియున్నాను.

వర:—నా కెందుకీగోల ఇంటిఅద్దెయు, వెచ్చముల కోమటికిని నెట్లిచ్చు కొందువో. (నిష్క్రమించును.)

సూర్య:—సుందరీ! నీతల్లియింత నిర్భయముగా మాట్లాడునేమి గౌర వము తెలియదా.

సుంద:—(తనలో) ఓహో! ఈతని గౌరవము బండ్లకోలువారి వద్దను, తన్ననుసరించి త్రాగుచుకై తిరుగు సాహేబులవద్దనే కదా! (ప్రకాశముగా) ఆ సంగతి నిక మఱచిపోండు. ముసలి దాని మాటలు మనకు లక్ష్యమా! (ఇంచుక యూరకుండి) ఇంతకును మీచేతిలోనికి సొమ్మెప్పుడు వచ్చును. నాకు మిమ్మును ఘడియ ఘడియకును నడుగుటకుఁ జాలకష్టముగ నున్నది కాని యిరుగు పొరుగున నున్న బాకీల తొందరచే నడుగక తప్పదయ్యెను.

సూర్య:—నేనా విషయమును గూర్చియే ప్రయత్నము సేయుచు న్నాను. నాలుగయిదు రోజులలో కార్యము సానుకూల మగును. అకారణముగ నా మహమ్మదీయ మిత్రునిచే రెండు వందల రూప్యములు నష్టము సంభవించుటచే మనకింత శ్రమ కలిగినది.

సుంద:—ఆసొమ్ము మనము కడుపునకుఁదిని యుంటిమేని విచారమే యుండదు.

సూర్య:—జరిగినదానికైవిచారమేల. అదిమనసొమ్ముకాదనుకొంటిని.

(లోపల)

అమ్మాయీ! పోలిశెట్టిగారు సొమ్ము అడగడానికి వచ్చినారు.

సూర్య:—ఓహో! ఈతఁడీ సమయముననే వచ్చెనా? అతఁడు కొంచెము ముక్కోపి నేనెచటనుంటినేని కేకలువేయును నేనీదొడ్డి త్రోవను పోయెదను నెమ్మదిగాచెప్పి నీవీతనిని బంపివేయుము. నేను సంధ్యవేళ వచ్చెదను. (నిష్క్రమించును.)

నర:—(ప్రవేశించి) ఏడీ! పంతులు వెళ్ళినాడా యేమి?

సుంద:—పోలిశెట్టి వచ్చినమాట విని నెమ్మదిగా నీదారిని నరిగెను.

నర:—పోలిశెట్టిని లోపలికి పంపెదను. చల్లగా నీతనిని వశముఁజేసికొనుము ఈతని వలన మనకు లాభము కలుగును. ఇంక పయ్యాకు పంతులు పని యొడిసినది. (నిష్క్రమించును.)

[పోలిశెట్టి—ప్రవేశము.]

పోలి:—(సుందరినిఁ జూచి) అయ్యో రామా! ఎన్నిపిల్చినా పలకరు. ఇంటికొస్తే మీయమ్మేమో, నీదగ్గఱకు వెళ్లమంటుంది. నీదగ్గిరకొస్తే పంతులుగారు లేరంటావు. నాకేమిటీయవస్థ. ఇచ్చి తిరగవలసి వచ్చింది.

సుంద:—మీబోటివారు మాగృహమునకెట్లు వచ్చెదరు? ఈమూలముననైన వచ్చుచుంటిరి.

పోలి:—మీపంతులుగారు సొమ్ము తెచ్చినారటగా. ఇయ్యరాదూ!

సుంద:—సొమ్మున్నవో మిమ్ములను కేపనియు, మాపనియు త్రిప్పెదమా? ఇదేమి! నిలఁబడియే మాట్లాడుచున్నారు. ఈకుర్చీమీద కూర్చుండుఁడు.

పోలి:—(కూర్చుండి) ఎప్పుడువచ్చినా డబ్బులేదన్న మాటేకదా. నిక్షేపంవంటి పంతుల్ని, చిన్నవాణ్ణి యింట్లో వుంచుకొన్నావు ఇహ తక్కువేమిటి?

సుంద:—లోకమంతయు నట్లే యనుకొందురు. కాని మాపంతులుగారి సంగతి యొవరికిఁ దెలియును. "నోరు అప్పాలపండు. చేయి బలుసుకూర"

పోలి:—(తనలో) మంచి సక్కనిసుక్క. ఏవిటో దీన్ని సూడగానే శాస్త్రభవ తట్టుతూంది. (ఆలోచించును.)

సుంద:—(తనలో) ఈవైశ్యుఁ డేమియో యాలోచించు చున్నాడు. చిత్తవికార ముదయించినట్టున్నది ఈతనిని క్రేగంటిచూపుల పాలుఁ జేసెదఁగాక. (చూచుచున్నది)

పోలి:—(తనలో) అహా! ఏవి! ఈసూపులు. ఒక్కొక్కసూపుకి కుంచెడు సెనగ లియ్యవచ్చును.

సుంద:—సెట్టిగారూ. మీరు సాధారణముగా మాయింటివారి గృహములకు సొమ్ము బాకీయుండినఁగాని రారుకదా!

పోలి:—ఏమిపనుంటుంది. (తనలో) అబ్బో దీనిమాటలు అమృతాం వొలుకుతాయి. (ప్రకాశముగా) మీ పంతులుగారు లేరా యేవిటి!

సుంద:—లేరు లెండి.

పోలి:—ఇప్పుడొస్తారా?

సుంద:—సాయంత్రముగాని రారు.

పోలి.—(తనలో) మనస్సులో మనసు లేదు. శాస్త్రకదిపితే యేవి కొంపంటుకుంటుందో. అయినా నెమ్మదిగా కదువుదాం.

(ప్రకాశముగా) సగటు షుమారున మీసంపాదన నెలకేమాత్రం వుంటుంది.

సుంద:—సెట్టిగారూ! మీరు సామాన్యులుకారే.

పోలి:—ఏమి! మీదీ ఒక వ్యాపారం కదా! అందుకోన మడిగినాను. అడగడం తప్పా నేమిటి?

సుంద:—చాలుఁ జాలు. లెండి నన్ను తక్కిన వేశ్యలతోఁబాటుగనే చూచినారా నేమి?

పోలి:—అబ్బే! అందరిలో ఈవూళ్ళోవున్న బోగవాళ్ళని నీమీద నుంచి దిగతుడచాలి.

సుంద:—నేను అంత అందకత్తెనా?

పోలి:—సందేహామేమి?

సుంద:—పోనీలెండు. నేను కొంతవఱకు గృతార్థురాలనే. మీకు మామీద దయ లేకపోయినను, సౌందర్యమం దసమానననియైన మీవినుతికిఁ బాత్రత వహించితిని.

పోలి:—దయ లేకపోవడ మేమిటి? ఏమీ లేకపోతే యింత అరువు మీకు పెట్టుతానా!

సుంద:—మమ్ముఁజూచి యిచ్చితిరా నేమి? సూర్యనారాయణగారిని జూచి,............

పోలి:—ఆ...ఆబాతఖానీల భగవంతాన్ని నమ్మేదెవరు. ఇదంతా నిన్ను చూచే యిచ్చాననుకో.

సుంద:—మీరేమి యిచ్చినను నోకచెక్కలుమాత్రము......

పోలి:—మొత్తానికన్నావు మొన్నోచ్చిన సరుకు మంచిదికాదు. కొంచెంనాసి. ఈవాళ్ళ మంచిసరు కొచ్చింది. ఏవన్నా యిత్తేడు

పంపమన్నావా? మేవిటి? మీయింట్లో ఎప్పుడూ తాంబోళం ఖర్చెక్కువేనా!

సుంద:—ఇదివఱకు బాకీయే తీర్చలేదూ. మళ్ళీవచ్చా!

పోలి:—పరవాలేదు. బాకీవిషయంలో నీవేమీ జడియవొద్దు.

సుంద:—(తనలో) ఈతనిని నెమ్మదిగా మోహసాగరమున ముంచి నాయింటికి వచ్చునట్లు జేసికొంటి నేని ధన్యనగుదును. (ప్రకాశముగా) మీఋణము మాకేల? పెట్టినాడు యెప్పుడును మేళమున కైన బిలిచియెఱుగను.

పోలి:—తొందరపడకు. మాబుల్లోడికి అన్నంపెట్టించే సంగతి వస్తు వుంది. అప్పుడు మేళంపెట్టిస్తా (ఇటునటుజూచి) వ్యాపారం మఱచి నీతో మాట్లాడుతూ కూచుంటే నెల్లాగు వెళ్ళాలి.

సుంద:—పెద్దమనుష్యులు తాంబూలమైన స్వీకరింపుడు.

(తాంబూలమిచ్చును)

పోలి:—(తనలో) సెయ్యి తగిలేటప్పటికి వొళ్ళు జల్లుమంది. (తాంబూలము చూచుకొని) అబ్బో! సున్నంచాలా పెట్టేవు ఇదంతా వేసుకొంటే నోరు పొక్కి సావనూ!

సుంద:—నేను రాసియిచ్చెద. (అట్లుచేసి) ఇదిగో పుచ్చుకొనుడు.

పోలి:—నాకోసం సుట్టలుసుట్టవే (పుచ్చుకొని) తాంబోళంయిచ్చావు మహారాజువు. (ఇంచుకయూరకుండి) మీపంతులు వూళ్ళోనే వుంటాడా! ఏవూరైనా వెళ్ళుతాడా!

సుంద:—ఏమిపని?

పోలి:—మరేవీలేదు. నీతో కొన్నిసంగతులు సావకాశంగా మాట్లాడాలి.

సుంద:—మీకభ్యంతరమే ముందును. మీరాయిచ్చవచ్చిన యప్పుడు రావచ్చును.

పోలి:—ఇహ పరవాలేదు. మాటిచ్చావు. నేను వెళ్ళివస్తాను.

(నిష్క్రమించును.)

సుంద:—(తనలో) పంతులు నేడో రేపో యూరికేగును. ఈసెట్టిని బిలిపించెద గాక. (నిష్క్రమించును)

రంగము:-[శివశంకరుని గృహము:- ప్రవేశము రామారావు.]

రామా.—(తనలో) అనేకదినములనుండి సుందరి నన్నొకసారిరమ్మని వార్త పంపుచుండఁగా నిన్న సాయంసమయమునఁ బోయితిని. ఎందులకా యనుకొంటిని. ఎల్లైనను దన యింటికి శివశంకరుని దోడ్కొనిరమ్మని చెప్పినది. ఈకార్యము నాకుసులభమే గాని, యీపని నేను చేయవచ్చునా లేదా యను సంశయము నాచిత్తమున బాధించుచున్నది. (ఆలోచించి) దీనికైసంశయింపనేల? దీని వలన నాకుఁగూడఁ గొంత లాభము కలుగును.

సీ. ఉద్యోగమాశించి ♦ యువిదలఁ దమపైన
నధికారులకునుదార్చి ♦ యలరువారు
ధనమునకాశించి ♦ ధనకామినీమణు
లనుహితులకుఁదార్చి ♦ తనరువారు
హితులకుఋణముల ♦ నిప్పించి యిటునటు
తోచినసొమ్ములను ♦ ద్రోచువారు
శిష్టులవంచింప ♦ సృష్టించిషట్లిముల్
పరులకొంపలఁదీసి ♦ వరలువారు

తే. గీ. దొంగ సాక్ష్యంబులిచ్చుచు • తొలగువారు
వీరవారికిబోరు గ • ల్పించువారు
గలరు పెక్కండ్రుపురుషులు • క్ష్మాతలమున
నందులో నొక్కడను శంక • బొందనేల.

శివశంకరుని హృదయము నెట్లయినను సుందరికై యెక్కునట్లు జేసితినేని సుందరితో స్నేహము మాటకేమి, శివశంకరునివద్ద నుండో నెపమున ధనము గైకొనుచు నుండవచ్చును. (ఎదుటజూచి) అదిగో శివశంకరుడు వచ్చుచున్నాడు.

(శివశంకరుడు—ప్రవేశించును.)

శివ:—(రామారావునుజూచి) మిత్రమా నీవు వచ్చియెంతసేపయినది.

రామా:—ఇప్పుడే వచ్చితిని.

శివ:—రమ్ము ఇటగూర్చుండుము. విశేషములేమి ?

రామా:—విశేషములేమున్నవి ! (ఇంచుకయాగారకుండి) సూర్యనారాయణ విక్రయించదలంచిన పొలమునుగూర్చి నీవేమైన యాలోచించితివా ?

శివ:—ఆలోచన కేమియున్నది. అనవసరమైన కార్యములందు ప్రవేశించుటకు నాచిత్తము సమ్మతింపక యున్నది. అది మనము కొంటిమేని ముందేమి కలతలు సంభవించునో లేనిపోనిది తెచ్చి నెత్తిపై బెట్టుకొననేల ?

రామా:—అతడా విషయమై యనేక ప్రయత్నములు సేయుచు న్నాడు కాని యెవరోకొనుటకు సంసిద్ధులైయున్నట్లు తెలిసినది.

శివ:—అతడిప్పుడా భూమిని విక్రయించుట కంటె తొందరపడనేల ?

రామా.—తొందరగాకేమి? కర్తపురమునుండి యాతఁడు తెచ్చి యుంచిన సుందరి యున్నదికదా తక్కిన విషయము లెట్లుండి నను దాని పోషణము మఱచియుండరాదు కదా!

శివ:—వేశ్యావిషయమున నేమాత్రము లోటురాగూడదు కదా! ఈతఁడిట్టి వ్యాపారములు సేయుచు నెన్నాళ్ళు సుందరిని పోషించును.

తే. గీ. ధనసతులకు ధనంబే ప్ర ♦ ధానమరయ
నట్టిచోనది లేకున్న ♦ నవ్వెలంది
వానిసైగఁషు ననురాగ ♦ భావమూని
దనరుచుండునె నోరులను ♦ దలఁపకుండ.

రామా:—నీవు చెప్పినమాట నిశ్చయమే; కాని సుందరి విషయమట్టి దిగాదు. తక్కిన వేశ్యలకును దీనికిని భేదమున్నది. కర్తపుర మున నదియున్నప్పుడేమి జరిగెనో మనకుఁ దెలియదుగాని యిక్కడకు వచ్చినప్పటినుండియు సూర్యనారాయణను దప్ప నన్యులను గన్నెత్తిచూచి యెఱుఁగదని దృఢముగాఁ జెప్పఁ గలను. దానింగూర్చి ప్రయత్నించిన నా స్నేహితులలోఁ గొందఱుగూడఁ జెప్పియున్నారు. గాని, యికముందు దాని చిత్తవృత్తియెట్లు మారునో చెప్పఁజాలను.

శివ:—ఎందుచేత?

రామా:—ఏమున్నది? సూర్యనారాయణుని చేత ధనమునున్నయగు టయే యిందులకుఁ గారణము సుందరి తల్లి సూర్యనారాయ ణునకు గొలఁది దినములలోనే స్వస్తివాక్యము జెప్పునని తోఁచును.

శివ:—సౌందర్యవతియగు నాసుందరికి సూర్యనారాయణ లేకున్న చో గొఱత కలుగునా ?

రామా:—కాని, తన్నుఁజేపట్టిన వారియెడల నా కాంత విశ్వాస ముంచి మెలంగును.

శివ:—సౌందర్యమున నాసుందరి కీపురమున నెవ్వరును నీడుగారని విని యుంటిని.

రామా:—(తనలో) ఈతనికానుందరియందు మోహము జనింపఁజేసి దనుగాక ! (ప్రకాశముగా) అందుకు సందేహ మేమున్నది ? ఏమహారాజు గర్భముననో జనింపఁజేయుట మఱచి, విధాత దానిని వేశ్యగాఁ జేసినాఁడు.

శివ:—ఏమీ ! ఆకాంత యంత సౌందర్యవతియా ?

మ. తలిరుంబోడులఁ జూచితెందఱినో యీ ♦ ధాత్రీస్థలిం, గాని యా యలివేణీమణికిన్ సమానయగు, స ♦ ద్భావాక్షి లేదెందు ; ని ర్మలసౌందర్య వయోవిలాసవిభవ ♦ ప్రాగల్భ్య సంపన్నగా బలుకంజెల్లును దానినేయనుమ నే ♦ వ్యాకుస్తుమమ్మాటికిన్.

తే. గీ. వనజభవుఁడు జగమునందు ♦ వనితలందు
మేటిగానేయ, సృష్టించె ♦ మెలతినట్లు
గాకయుండిన నాభువ ♦ నైక మోహ
నాద్భుతాకారమును నే ♦ యనుగుసఖుడ.

శివ:—(తనలో) వారసతులం దట్టి సౌందర్యవతి లేదని వినియుంటిని ఆవధూటిం దిలకింప నాకుఁ గోర్కెయొదవె. కాని, యొకరి స్వాధీనమునను న్న యా యింతి గృహమున కేరీతిఁ బోవుదును (ఆలోచించును.)

రామా:—మిత్రమా! ఆలోచించుచుంటివేమి?

శివ:—సఖుఁడా! ఏమున్నది;

తే. గీ. భువనమోహినియైన యా ♦ పూవుబోడి
నొక్కసారిచూడఁగ గోర్కె ♦ యొదవె; నొకని
వశమున నలఁచుచుండిన ♦ వనితకడకు
జనుట యెట్లని మదిలోన ♦ శంకవొడమె.

శివ:—నిజమే. కాని యీ విషయము నీ వతిరహస్యముగ నుంచ వలయును.

రామా:—స న్నన్యునిగా దలంచెదవేల? నిన్ను రేపు సంధ్యాసమయమున సుందరి గృహమునకుఁ గొనిపోయెదను. నీవు సంశయింప వలదు. నేపోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

శివ:—(తనలో) రామారాయుని మూలమున సుందరీ సౌందర్యవారాశి నోలలాడెదఁగాక! (నిష్క్రమించును.)

రంగ:-[సుందరిగృహము:—సుందరి ప్రవేశము.]

సుంద:—(తనలో, మాతృని నిష్ఠురవాక్యములకు భయమంది సూర్యనారాయణ వచ్చుట మానినాఁడు. పోనిమ్ము. ఇదియు నొకమేలె. (ఇంచుక యూరకుండి) రామారాయునితో శివశంకరునిగూర్చి చెప్పియున్నాను. ఆతఁడీ విషయమునుగూర్చి ప్రయత్నము సేయునో సేయఁడో!

తే. గీ. సఖునివాక్యంబువిని శివ ♦ శంకరుండు
నాకడకువచ్చెనేని, వ ♦ నంబునందు
వలనుబన్ని మృగంబుల ♦ బట్టు వేట
కానిపగిది బంధించెదఁ ♦ గాకవాని.

శివశంకరుఁడు ధనవంతుఁడును, భోగపరాయణుఁడును నగు టంజేసి నాకొంతియుఁ దగినవాఁడు. ఇంతకును నాతఁడు నా గృహంబునకు రావలయును గదా!

[నరహరి—ప్రవేశించును.]

నర:—(సుందరినిఁ జూచి) అమ్మాయీ! శివశంకరశాస్త్రిగారు రామారావుగారితో వచ్చుచున్నారు.

సుంద:—(తనలో) భాగ్యము పండినది.

(శివశంకరుఁడు—రామారావు ప్రవేశము]

శివ:—రామారాయా! మనరాక సూర్యనారాయణునకుఁ దెలిసినేని యాతఁడేమి తలఁచునో కదా!

రామ:—మనరాక యాతనికేగాక వారి హితులకైనను దెలియదు.

నర:—(శివశంకరునిఁ జూచి) ఇటు దయసేయుఁడు (సుందరినిఁజూచి) ఎన్నఁడును రాని మహానుభావులు మన గృహంబున కరుదెంచినారు. ఎట్లు గౌరవింతువో.

శివ:—(సుందరినిజూచి తనలో)

ఉ. ఎందఱులేరువారవన ♦ జేక్షణ లిప్పురమందుగాఁని యీ
యందముచందముల్ గలిగి ♦ నట్టి సతీమణిజూడనైతి; దీ
నిందగసృష్టిఁజేసి తన ♦ నేర్పునుజూపె ధవా విరించి; యీ
యిందునిభాస్యఁజూచుటను ♦ నేను గృతార్థుడనైతి నెంతయున్.

ఈ భువనైక సుందరిని గూడినప్పుడే నాజన్మ ధన్యతవహించును.

సుంద:—(శివశంకరునిఁ జూచి) వందనములు. ఈ యాసన మధిష్టింపుడు. (రామారావునుజూచి) రామారావుగారూ! ఇటు దయసేయుఁడు.

(ఇరువురును వేరువేరు పీఠములపై నాసీనులగుదురు.)

సుంద:—(శివశంకరునిఁజూచి)

తే. గీ. పావనంబైన గంగాప్ర ♦ వాహమెలమి
చౌటినేలపై బారిన ♦ సరణిపరను
పావనచరిత్రులౌచును ♦ వరలుమీరు
నాగృహంబున కేతెంచి ♦ నారునేడు

ఆర్యా ! మీరాకఁ జేసి నే నెంతయుఁ గృతార్థురాల నైతిని.

సర:—అమ్మాయీ ! నిజము జెప్పితివి.

శివ:—సుందరీ ! నీకు నాయందున్న గౌరవభావంబున నట్లు బలికెదవు
గాని, నాయందున్న విశేషమేమి ?

తే. గీ. అతిన భూలోకరంభవై ♦ యలరునీదు
ప్రాపుజేరిన సూర్యనా ♦ రాయణుండు
కిమ్ముకృతార్థుఁడనవలదె ♦ కమలనయన
కాకయుండిన నిపొందు ♦ కలుగుటెట్లు.

సుంద:—సరిసరి. ఏంతెమాట సెలవిచ్చితిరి.

శివ:—సూర్యనారాయణ గ్రామమునందే యున్నవాడా ?

సర:—రసగ్రహణ పారీణులగు తమకుఁ దెలియని విషయము
లేనుండదు.

తే. గీ. విత్తమేమియుఁగోరక ♦ విటునిమొదల
బ్రేమఁజూపిన మంచిదా ♦ వెలవెలంది
విత్తమడిగిన యంతనే ♦ విటునకాగ్ర
హంబొదవి యిల్వెడలుగావె ♦ యలఘుచరిత.

శివ:—(తనలో) ఈమె వాక్యములఁ జూడఁగా ద్రవ్యలోపముచే సూర్యనారాయణుఁడు వచ్చుచుండుట లేదని తోఁచుచున్నది. (ప్రకాశముగా) రసజ్ఞలె లేనివారట్లు సేయుదురు (రామా రావునుజూచి రహస్యముగా) మిత్రమా! మనమిచ్చోట కొను దెంచినందులకు, సుందరి విషయమై యేమైనఖర్చు పెట్టకపోయి నచో గౌరవముగ నుండదు. నీవడిగినన్ను లెక్కయిచ్చి "విస్కీ" బుడ్డి యొకటి తీసికొనిరమ్ము. తినిన ఫలహారంబులఁ గూడఁ గొనితెమ్ము. ఈకార్యమున నిన్ను నియోగించితినని మఱియొకవిధమున భావింపవలదు.

రామా:—ఎంతమాటఁ బలికితివి! (నిష్క్రమించును)

నర:—అమ్మాయీ! దాసి పిల్చుచున్నదికాబోలు.

(నిష్క్రమించును.)

సుంద:—(తనలో) ఈతని నెట్లయినను నావశము జేసికొంటినేని నాకేకొఱంతయు లేక యుండును. (ప్రకాశముగా) మీరు విచ్చేయుటంజేసి నాగృహము పావనమైనది.

శివ:—కాదు. కాదు. నిన్ను నేను జూచుటకు నాకన్నులు పూర్వ జన్మమున నెంతో సుకృతము జేసుకొని యున్నవి.

సుంద:—నేను మీ వినుతికిఁ బాత్రురాలను గాను. ఏమైనను నేఁడు దారితప్పి మాయింటికి వచ్చినారు.

శివ:—

ప. ఎన్నిదినాలనుండియో, స ♦ తీ నినుజూడగగోర్కె చిత్తమం దున్నది, యేమిసేయుదును ♦ నొక్కని యుంపుడుకత్తెవౌచు నీ వున్నతెఱంగెఱింగి మది ♦ యొప్పకయుండెను, వచ్చిపోవఁగాఁ గన్నులకర్వుదీఱ నినుఁ ♦ గంజదళేక్షణ నేడు చూచితిన్.

సుంద:—ఎన్నిరోజులనుండియో నాయంతట నేను మీకు వార్తఁ బం
పుటకై ప్రయత్నించుచుంటిని. మొన్నటిదినము సాయంసమ
యమున నేనే మీగృహంబునకు రాదలంచితిని. కాని, యం
తకుమున్నావంటి యుఁ బరిచయము లేనప్పుడు వచ్చితినేని మీ
చిత్తమున కేమి యాగ్రహ మొదవునో యని యూరకుంటిని.

శివ:—(తనలో) ఇట్లు పలుకు వేశ్యను నేనెందును జూడలేదు. ఈమె
నన్నుఁ గూర్చి విని, చిత్తమునన్ను బ్రేమించెఁగాబోలు. ఇట్టి
సౌందర్యవతిని విడువరాదు. కాని యీమెను సూర్యనారాయణ
సంపూర్ణముగ విడిచెనో లేదో యారయవలయును. (ప్రకా
శముగా) రమణీ !

తే. గీ. సూర్యనారాయణుఁడు నిన్ను ♦ సొంపుమీఱ
నన్నివిధములఁ జూచుచుఁ ♦ నలరుచుండ
నైదికుఁడ రసజ్ఞతలేని ♦ వాఁడ నన్ను
నింతిగాదలచెద వేల ♦ యిగురుబోఁడి.

సుంద:—ఎవరి ఘనతవారు చెప్పుకొందురా? మీరు రసజ్ఞతలేని
వారని చెప్పిన నన్యులు నమ్ముదురు. ఈ మాటల కేమి లెండు.

సీ. మేపూరు వేశ్యకు ♦ మేడకై ద్రవ్య స
హాయంబుసేయుట ♦ యరయ లేదె
శ్రీకాకుళపురం ♦ సిరుహాస్కికి గజ్జె
లొడ్డాణము నొసంగి ♦ యుండ లేదె
వేలూరు సానియా ♦ హేలావతిని
గొన్నినాళ్ళుంచుకొనుట వి ♦ నంగ లేదె
నూజివీడ్పురిలోన ♦ రాజవదనకు గ
న్నెఱికంబు సేయుట ♦ యెఱుఁగ లేదె

తే. గీ. యింతయేల ? మొన్న నికదా ♦ యిటకు వేడ్క
వచ్చిన శనివారవుపేట ♦ భద్రగిరిని
సత్రమందునఁ బదిదివ ♦ సంబులుంచి
వలసిన ధనంబు నిచ్చుట ♦ దెలియలేదె.

శివ:—(తనలో) ఈ సంగతులన్నియు దీనికెట్లు దెలిసెనో కదా. (ప్రకాశముగా)

తే. గీ. ఎందరుండిన నేమి ప ♦ ద్మేందువదన
మహిత సౌందర్య మందు స ♦ మానులెవరు
నీకు ; రూపమందున నీకు ♦ నీవెనాటి
సత్యమే వచియించితి ♦ జలరుహాక్షి.

సుంద:—నేను మీపజ్జంజేరి సుఖించుటకు నిరంతరమును వేయిదేవు ళ్ళకు మ్రొక్కుచుంటిని లోకమున స్త్రీలు అందులో వేశ్యలు తమవలపును బయలు పఱచరు. నేను కల్ల కపటంబు లెఱుం గని భావనగుటంజేసినా హృదయమును మీకు వెల్లడించితిని మీపదసేవఁజేసికొని కృతార్థురాలనగుట కీసేవకురాలి కాజ్ఞ యొసంగుఁడు.

సీ. కడుపునింపుకొ'సంగఁ ♦ గల్లమాటలు పల్కి
యమిత దుర్యశమును ♦ నందకుండ
విత్తమార్జింపఁగా ♦ విటులకు మానంబు
సిగ్గులేక క్రియము ♦ సేయకుండ
కులవృత్తి యిదియంచు ♦ కుంటికురూపుల
జేరనిచ్చుచుకోత ♦ జెందకుండ

నగలునాణెములకై ♦ తగనివారిని గూడి
సంకటంబులఁ గాంచి ♦ చావకుండ

తే. గీ. యితర వేశ్యలకెల్ల గ ♦ న్నెత్తుగాగ
బంజరంబున శారిక ♦ భంగినన్ను
బంధితగ జేసి మీ కృపా ♦ పంజరమున
నిలుపుకొనుఁడింక వేడెద ♦ లలితచరిత.

దిక్కుమాలిన యీ వేశ్యకులమునఁ బుట్టినందుల కెంతయుఁ బరితాపమును బొందుచుంటిని. కడుపుకూటికై తుచ్ఛవృత్తినిబూని చరించుటకు నా చిత్తమొప్పక యున్నది. రసజ్ఞులగు మీయొండఁ జేరి జీవయాత్రగడుపఁ దలంచితిని.

శివ:—(తనలో) ఆహా! అమృతోపమానంబులగు నీను పలుకులు వేశ్యలయందిట్టి దానినెందును జూచియుండలేదు. ఇది నాయధీనమునందుండఁ దగినకాంత (ప్రకాశముగా)

మ. తరుణీరత్నమ నీగుణంబులకు మో ♦ దంబెంతయుం గల్గెనీ
చరితంబెంతయు శ్లాఘ్యమై దనరె నీ ♦ చందంబునన్ మెల్లనే
శరదిందు ప్రతిమానబింబముఖి వే ♦ శ్యానంఘ మందెందు సు
స్థిర ప్రేమంబుదయింపఁ జేసెఁ గదరా ♦ జీవాక్షి నీవాక్యముల్.

తే. గీ. సుదతి సత్యంబువినుము నీ ♦ సోయగంబు
హితుఁడు పల్కిన యంతనే ♦ మతిచలించె
గరువుదీరంగ నీరూపు ♦ గాంచినంత
పంచబాణుఁడు శరముల ♦ పఱపదొడఁగె.

నేను నీ సౌందర్య పాశమున సంపూర్తిగ జిక్కితి ?

మ. పరివారమ్మువిడువ నవ్వనీ హితులు దో • షంబంచు నగ్గింపనీ
స్థిరభాగ్యంబు నశింపనీ సతియు దా • జల్లింటలో గుండనీ
గురువుల్ దూషణసేయనీ సుజనులున్ • గోపింపనీనిన్ను నన్
దరుణీరత్నమ యేలువాడసిక మో • దంబార సత్యంబుగన్.

ఇంక నేను నీవాడను నీవు నాదానవు.

సుంద:—(తనలో) విశేషప్రియుఱ్ఱ మవసనము లేకుండనే యీతఁడు జిక్కినాడు (ప్రకాశముగా) ఆర్యా! ఇప్పటికి నేను కృతార్థురాలనైతిని.

(రామారావు ప్రవేశము.)

శివ:—(రామారావును జూచి) మిత్రమా! వచ్చితివా! నే చెప్పినది తెచ్చితివా!

శివ:—అందుకొరకె కఱిగినప్పుడేల గొనిరాక యుందును.

(బ్రాంది బుడ్డి దీయును.)

సుంద:—(శివశంకరునిఁ జూచి) ఆర్యా! అదియేమి!

శివ:—ఇదియేమో నీకుఁ దెలియదా. ఇది ఆనందసుధ.

సుంద:—అంత కఠినపదమున కర్థము తెలిసికొనఁజాలినంత విద్య నా యొద్ద నున్నదా?

శివ:-

మ. వనితాయయ్యది "విస్కి" నాబడు సుధా పాత్రంబు మర్త్యాళికా
విన నానందమహాహ్లాదధిన్ శెలఁగుచున్ • విజ్ఞానముంగాంచి, ము
క్తిని సాధించెడు మార్గముంగనును సం • దేహంబు లేదింతయున్
వినగాయుండవె దీని దివ్యమహిమన్ • బింబాధరీ సుందరీ.

సుంద:—సరిసరి! ఇదియా! మహనీయ గుణాఢ్యులయిన మీకుఁగూడ దీనియందభిరుచియేనా?

శివ:—వేదాంత తత్త్వవిదులు కావలయునన్న వారు దీనిని గ్రోలితీర వలయును. (ఇంచుకయూరకుండి) దీని మహిమ చెప్పవలసినది కాదు. ఇంచుక చవిఁజూతుము. మీయింట నేదైన కాచపాత్రయున్నఁ దెమ్ము.

రామా:—అవసరము లేదు. ఇక్కడయుండునో లేదో యని దానిని గూడ తెచ్చితిని. (గ్లాసు నిచ్చును)

శివ:—(పుచ్చుకొని) ఓహో! నీవిజ్ఞానమెంతయు శ్లాఘ్యము. (గ్లాసులో సురను బోసి) రామారాయా! ముందునీవు స్వీకరింపుము.

రామా:—ముందు నేనే స్వీకరింపవలయునా! కానిమ్ము. నీమాట గాదననేల? (పుచ్చుకొని త్రాగును)

శివ:—(మరల గ్లాసులో సురను బోసి) సుందరీ! నీవించుక దీనిం గ్రహించినఁగాని నాచిత్తమున కానంద మొదవదు.

సుంద:—శాస్త్రిగారూ! ఈ సురాపానమునకు నేనెప్పుడును నలవాటు పడియుండలేదు.

శివ:—సుందరీ! నాయాజ్ఞఁ బరిపాలించుటకైన, నీవు దీనిని జవిఁజూచి తీరవలయును.

సుంద:—కానిండు మీ చిత్తమువచ్చినట్లే చేసెదను. (కొంచెము త్రాగుచున్నది)

రామా:—(తనలో) ఈముందఁ యిదివరకెన్ని సారులు త్రాగినదో

శివ:—ఇక నావంతున్నది. (గ్లాసులోపోసికొని త్రాగి) మిత్రమా ఇది కొత్తసరకు.

రామా:—నేను చెప్పినప్పుడు సరియైన రకముగా యుండకపోయినచో వాని గుండెలు చీల్చి వేయునా ?

శివ:—(తలద్రిప్పుచు) అవును గుండెలు చీల్చి వేయుటయే కాదు. కంఠము పిసికి వేయుదుము. మన పేరుచెప్పినచో తుపాకిపేల్చెదు.

సుంద:—(తనలో) ఓహో ! ఈమద్యముయొక్క ప్రభావమేమి ఈతఁడు చిలుక పలుకులకుఁ బ్రారంభించి నాడు.

శివ:—(మద్యపానవశమున) సుందరీ ! నీవీయఱ్ఱ కొంపలయందుండుట బాగులేదు. ఆసూర్యనారాయణ యిన్ని దినములు నీ గృహము నందుండి ననుమాటయెగాని శాశ్వతముగ నుండునట్లు నీకేమి ! చేసినాడు ? ఏమి ! రామారాయా, నిజమా ! అబద్ధమా ! సుందరియే నాయధీనమున నున్న...... చెప్పనా ? ఇది భోజనము సేయుట కొరకగది, వంటకు వేరుగది, చుట్టములువచ్చిన మర్యాదచేయుట కింకొకగది, దీనితల్లికొకగది, స్నేహితులెవరైన నా కొఱకిచ్చుటకు వచ్చిన వారితో నేను మాట్లాడుట కొక గది. ఈతీరున నుండునట్లు దివ్యభవనము గట్టించకుందునా ! సుందరీ ! ఈ రోజునుండి నీవు నాదానవు. ఇక నెవ్వరు నీగడప దొక్కరాదు. తెలిశినదా నీ కేమికొఱతరాదు.

రామా:—(నెమ్మదిగా) మిత్రమా ! ఈ కేకలేమి ! ఇంతవైత్య శరీరమేమి ?

శివ:—వెఱ్ఱివాడా ! నాకుమతిలేక యిట్లుమాట్లాడు చుంటినని తలంచితివా యేమి ! ఈమాత్రమునకే.

రామా:—(తనలో) ఈతనిని నెమ్మదిగా గృహమునకుఁ జేర్చవలయును. (ప్రకాశముగా) శివశంకరా ! ఇంటివద్ద నీకై వేచియుందురు. త్వరగా నేగుదమురమ్ము.

శివ:—ఇంటివద్ద......ఎవరు ఓహో! సుందరీ! నీవుగూడ నావెంట వచ్చెదవా యేమి!

రామా:—మిత్రమా! మనము తిరిగి రేపు రావచ్చును.

శివ:—రావచ్చు నేమి! సుందరిపై నేను సర్వ స్వాతంత్ర్యములం బొందితిని.

రామా:—మంచిదేరమ్ము.

(శివశంకరునితో నిష్క్రమించును)

సుంద:—(తనలో) నెమ్మదిగా వెచ్చములిచ్చు పోలీసెట్టిని వశము జేసికొంటిని. శివశంకరుండుగూడ నామోహసాగరమున మునింగినాండు ఇక నేనొంతయు లేను. (నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





# సువర్ణపాత్ర.



## తృతీయాంకము.

---

రంగము:—[శివశంకరునిగృహము—ప్రవేశము—శివశంకరుఁడు]

శివ:—(తనలో) అక్కటా! ఇదియేమివింత! ఎంతయోముచ్చటపడి, చేయించుకొనిన సువర్ణపాత్రి గృహంబునఁ గానరాకయున్నది. దీనికిఁ గారణము నాకిసుమంతయుఁ గానరాకయున్నది.

తే. గీ. పనితనమునంతయునుజూప ♦ వలయునంచు
స్వర్ణకారునితోఁ జెప్పి ♦ పరమముదము
మీరఁ జేయించుకొనినట్టు ♦ మేటి హేమ
పాత్రి కానరాదేమని ♦ వగచువాఁడ.

నాకతిముదంబునుగూర్చుచుండు నాపాత్రి నెవరుదొంగిలించిరో కదా. నేను గృహంబువిడచిపోవునప్పుడు దానిని జాగ్రత్తపెట్టుకొనియే పోవుచుంటిని. ఈవిషయమై యెవ్వరినడుగుదును. నాభార్య దానినెచ్చటనుంచితినో చూడలేదని చెప్పెను. (ఇంచుకయూరకుండి) నాకొఱకు వచ్చుచుండు స్నేహితులలో నెవ్వరో తిస్కరించియుందురు. కాని నిశ్చ

యముగ నీవే దొంగిలించితివని యెవ్వరిని ధైర్యముతో నడుగగలను. అడిగితినేని వారికి విరోధినగుట నిశ్చయము. కావున నీసంగతినిఁ గూర్చి విచారింపక యూరకొనుటయే యుత్తమము. (ఎదుటఁజూచి) అదిగో గడియారం యెనిమిది గంటలుకొట్టినది. సుందరి నాకొఱకై వేచియుండును. సత్వరముగఁ బోవలయును. (ఇంచుక నడచును.)

(ముకుందశాస్త్రి—ప్రవేశము.)

ముకుం:—(శివశంకరునిజూచి) మిత్రమా! శివశంకరా! ఎక్కడికో బయలుదేరితివే?

శివ:—ఓహో! ముకుందశాస్త్రీ! బయలుదేర నెంచుచుండఁగా నీవిక్కడ వెనువెంటవచ్చుటయేగాక యెక్కడ కరుగుచుంటి వని యమంగళవాక్యముగూడఁ బలికితివా?

ముకుం:—ఏదియైన ఘనకార్యము మనంబున సంకల్పించుకొని, వెళ్ళుచుంటివా యేమి?

శివ:—ఘనకార్యమేమియు లేదు. అనుదినమును బోవుచుండు గృహమునకే.

ముకుం:—అనగా నాకర్థము తెలియలేదు.

శివ:—నీకా! అర్థముతెలియనిది.

ముకుం:—సుందరి గృహమునకేకదా!

శివ:—నీకుఁ దెలియనిదేమున్నది?

ముకుం:—మిత్రమా! అయిదు నిమిషములు గూర్చుందువా?

శివ:—మధ్యాహ్నసమయమున సావకాశముగఁ గూర్చుండ వచ్చును గదా!

ముకుం:—సుందరి యింటికి యించుక యాలస్యముగా వెళ్ళగూడదా యేమి ?

శివ:—నే నీరోజున నెనిమిదిగంటలకు సరిగా వచ్చెదనని చెప్పియుంటిని. అది నాకై వేచియుండును.

ముకుం:—శివశంకరా! బాల్యస్నేహితుఁడను సహపాఠిని అగుటం జేసి, నీతోఁ గొంతవఱకు ముచ్చటింపఁ దలఁచితిని.

సీ. సకలశాస్త్రంబులు ♦ సమధిక శ్రద్ధతో
సజ్జనుల్ నుతియింపఁ ♦ జదివినావు
చదువుటేగాక ♦ భాషానాగరంబున
గుంభసాధ్యము తెఁ ♦ గ్రోలినావు
గ్రోలుటేగాక స ♦ త్కులధర్మముల నెల్ల
సాపూర్తిగాఁ జూడ ♦ నేర్చినావు
చూచుటయేగాక ♦ నాచరింపఁగ సం
దుముచుఁ గొన్నినా ♦ ళ్ళొప్పినావు
తే. గీ. అట్టినీవేడ కటకటా ♦ యాటవెలఁది
మోహనాకారంబున నిల్లు ♦ మునుగు నీవు
నిజకులాచారధర్మముల్ ♦ నీటఁగల్పఁ
దలఁచితో! యిదినీకును ♦ దగవుగాదు.

నేను నిరంతరమును నీయభివృద్ధిఁ గోరుచుండినవాడ నగుటం జేసి, యిట్లు చెప్పసాహసించితిని.

సీ. కనుసైగలను జేసి ♦ సునమోహపాశంబు
నందాదగుశ్లోకాను ♦ సట్లు జేసి
యింటికిఁ జేరగా ♦ నిచ్చి, కపటమైన
వలపునుజూపించి ♦ పలువిధముల

మృదువాక్యములచేత ♦ మెప్పించి, తృటినైనఁ
దన్నెడబాసిన ♦ దాళజాల
నట్లునటించుచు ♦ ననురాగచేష్టలఁ
జూపుచుహితవున ♦ నోపుకొలది

తే. గీ. విటునిచిత్తంబుగఱగించి ♦ విత్తమెల్ల
సంగ్రహించి, సుదతి వృత్తి ♦ జననిఁ జేత
స్వప్నఁ జెప్పించునద్వార ♦ పతినిఁ జేర
దగునిఁ యక్కటా నీవంటి ♦ ధర్మగుణులు.

శివ:—

తే. గీ. నీవుచెప్పుచుండుమాటలు ♦ నిశ్చయంబు
గణికలందైన నుండుట ♦ కాని, యావె
లందులందున సుందరియైన ♦ సుందరికిని
మిగుల భేదంబుగలదయ్య ♦ జగతియందు.

మిత్రమా! నీవు సుందరిసంగతి పూర్తిగ నెఱింగినవాడవు కాక పోవుట జేసి యట్లు బలుకుచుంటివి. అది సామాన్య వేశ్యలవంటిదికాదు.

మ. అవనీభాగ్యరాశికిన్ సతీమణిగఁ జేయం ♦ గామనంబందు, నెం
చి; విశేషంబుగ యత్నముల్ సలిపి, రా ♦ జీవాక్షినీభంగినిన్
భువివేశ్యామణిగా సృజించెఁగమలో ♦ ద్భూతుండు; నద్దానికే
ను వయస్యా! యెఱిఁగింపఁజాలగతిమున్ ♦ ముమ్మాటికిన్ నమ్ముమా.

అది వేశ్యయైనను నాయందు సహధర్మచారిణీ వ్రతము నవలంబించి యున్నదని నేను నొక్కి వక్కాణింపఁ గలను.

ముకుం:—మిత్రమా! సమస్తము దెలిసిన నీ వెంత యజ్ఞానాబ్ధిలో బడుచుంటివి.

"సీ. చింతపండాదిగాఁ ♦ జిల్లరవెలలేక
వెచ్చమిచ్చెడి వైశ్య ♦ విటుఁడొకండు
పునుగత్తరువు గులా ♦ ల్పొడిజవాజి కరాట
వాసనలకు లబ్బె ♦ వాఁడొకండు
చీరలురవికలు ♦ చీటితానులు నిచ్చి
వచ్చునేస్తపునాఁడె ♦ వాఁడొకండు
కోరినవస్తువుల్ ♦ కొఱంతలేక యొసంగు
గల యిష్టుఁడగు సావు ♦ కారియొకడు
గీ. ఇంకవిటులెందఱో వెల ♦ యింతులకును
వారిసుఖభాగ్యపదవి యా ♦ బ్రహ్మకేలోక"

అని గణికాగుణ ప్రవర్తన తారావళియందు నీవు చదివిన పద్యము మఱచిపోయితివా యేమి?

శివ:—ముకుందశాస్త్రీ! గ్రంథములయందు గవులు రచించిన వానిం బట్టియా నీవిట్లు బలుకుచుంటివి.

సీ. చింతామణీ వార ♦ కాంతామణుంకైన
బిల్వమంగళుమాట ♦ వినఁగలేదె
నిరతంబు ధనకామి ♦ నీలోల్పునై వట్టి
కాళిదాసుని జాడ ♦ గాంచలేదె
వెలవెలందుల పొందు ♦ కలితమోక్షమనిన
శ్రీనాథుస్థితి జెవిఁ ♦ జేర్పలేదె
పణ్యాంగనాస్నేహ ♦ భాగ్యంబునందూగు
ధూర్జటినడతలు ♦ దోచలేదె
తే. గీ. గ్రంథములకేమి యెన్నైన ♦ వ్రాయవచ్చు
నిజమునరయంగ నొక్కంత ♦ నిర్మలాత్ము

డైన కవిరాజులేడయ్య ♦ యవనియందు
కవుల వాక్యములు దలఁప ♦ గాఁబనేమి.

ముకుం:—నీవికల్పప్రశ్నములకు నేనేమియుఁ బ్రత్యుత్తర మీయఁజా లను. మంచిసంగతులనే మేల యుదాహరణముగా దీసికొన రాదు.

సీ. కులకాంత నిడఁబాయు ♦ వలపు మందులఁ బెట్టి
విటుల శేంగదీసి ♦ విత్తమే ప్ర
ధానముగఁ దలంచి ♦ ధర్మవిచారణ
సేయక మదిలోన ♦ రోయకుండ
కుంటిదైనను మఱి ♦ గుడ్డిదైనను వేశ్య
పాళిలు జూడక ♦ పసులరీతి
గలయుచుండు గణిక ♦ కాంతల కనురాగ
మేటనలవదు ♦ నెవ్వడైన
తే. గీ. విన్న నమ్మను లేదని ♦ వేలసఖుడ
తెలిసియుండియు సర్వంబు ♦ బలికెదేల
యిట్లు; నీవుంచుకొనినట్టి ♦ యింతి వేశ్య
కులమునందున జన్మించి ♦ యలరలేదె.

ఉ. ఎందఱిఁ జేరదీసె, మఱి ♦ యెందఱితోడ రమించి మించె, నిం
కెందఱి కొంపలార్చె? విటు ♦ లెందఱి జోగులుగాగ జేసె ; నిం
కెందఱి ధర్మపత్నులను ♦ నేడ్వగ జేసెను నీదు వేశ్య ; యా
యిందునిభాస్య వర్తనము ♦ నెవ్వరెఱుంగరు మిత్రరత్నమా.

కర్తవ్యగమున నెందఱికి సన్న్యాసమిచ్చెనో ! ఇంతయేల ? మన కన్నులముందు సూర్యనారాయణ యడుగంటిపోవుట కెవ్వరు కారణము.

తే. గీ. మంచికులమునజననంబు ♦ గాంచి; పూర్వ
దత్తమైనట్టి ధనముతో ♦ దనరి; కన్ను
మిన్నెఱుంగక, వారకా ♦ మినినిమఱిగి
నేఁడుజోగియై తిరుగుట ♦ జూడలేదె.

మ. "ధనమాపోవును; మానమాచెడును; నిం ♦ దానిత్యాకీర్తు[illegible]; లో
కనుమానింతురు తల్లిదండ్రులు; కులం ♦ బౌనన్నియుం దక్కు; నూ
తనమాంద్యమ్మగుఘుటిల్లు; బంధుగులు పం ♦ [illegible]
మనమా వర్ధిక నాదుమాటవినుమా ♦ [illegible]వాడుమా.

అని నీవు శ్రవణానంద గ్రంథమున జదివిన పద్యము జ్ఞప్తికిం దెచ్చుకొనుము. సకలమెఱింగిన నీకు నేనంతకన్న నేమియుం జెప్పంజాలను. పిదప నీయిష్టము.

శివ:—మిత్రమా! నీవు చెప్పినవాక్యములకు నాకానంతయుం గోపము లేదు. కాని, సూర్యనారాయణునకు నాకును హస్తిమశకాంతరము. ఆతడవివేకి యగుటం జేసి యట్లు పలికినాఁడు. సుందరి హృదయ తత్త్వము నాతఁడెఱుంగ లేఁడు. ([illegible]) ఇప్పుడీ యనవసరమైన చర్చయేల? నా కవసరమైన పని యున్నది. మఱియొక సమయమునం గలసికొందము.

ముకుం:—ఎప్పుడు కలసికొనినను నేనువచించు వాక్యము లిట్టివే కానిమ్ము. (నిష్క్రమించును.)

---

(సత్యవతి—ప్రవేశము.)

సత్య:—(శివశంకరునిం జూచి) నాథా! ముకుందశాస్త్రి యేదియో చెప్పుచున్నాఁడే.

శివ:—ముకుందశాస్త్రికిని నీకును బనియేమున్నది.

సత్య:—మీరెంత చెప్పఁబోయినను, నేను వినలేదని తలంచితిరా యేమి. సుందరింగూర్చియే కదా యాతఁడు చెప్పుచున్నాఁడు. మీ శ్రేయమునుగోరి యాతఁడు చెప్పువాక్యములఁ బాటింపుఁడు. అది యట్లుండ మధుపానవిషయమై నేఁజేయుచున్న ప్రార్థన నంగీకరింపకుండిరి. మీరు మధుపానమునకు నలవాటుపడుటయే గాక, సుందరినిగూడ మఱిగి నన్నొక దాసికంటె నతినీచముగఁ జూచుచున్నారు. మీరు నాయెడల నిష్కరుణనహించి యున్నందుకుఁగూడ నేను విచారింపను. తిట్టినను, గొట్టినను మీరే నాకు దిక్కు. కాని మధుపానాది దుర్గుణంబుల మాని కులగౌరవమును గాపాడుఁడు. పాపంబులకు సంతవంటిదియు, దుర్వ్యసనలకు నిలయంబును, మర్యాదమాపుటకు దంటయు నగు నీ మధుపానము మీ రేల మానరు. దీనివలన నెంతదారిద్ర్యము ప్రాప్తించుచున్నదో మీ రేల యెఱుఁగకుండిరి? ఉన్న ధనమంతయు నిట్లు వ్యయమైనపిదప మనల నెవరుచూతురు. ప్రాణేశ్వరా నామనవి వినుఁడు.

శివ:—నీమాత్రము తెలివి నాకులేదని తలంచుచుంటివా యేమి? నేను నిన్ను నీచముగఁ జూచుచుంటినని పలికితివి. నావలన నీకుఁ గొఱంతయేమి? నగలులేవా? వస్త్రములులేవా? కడుపునిండ కూడులేదా? నావిషయమై నీవు కుందనేల?

సత్య:—నాకట్టి కొఱంత యేమియునులేదు. కాని, మీరు దుష్కృత్యముల పొంతఁబోవుచుండుటయే కొఱంత.

మ. ధరణీదేవకులంబునం బొడమి శాస్త్రజ్ఞానముంగాంచి ; భా
స్వరకీర్తింగొన జాలునీవిటులు వే ♦ శ్యాలోలతన్ జిక్కి ము

మ్మరులౌమిత్రులఁగూడి త్రాగుటకు ♦ వెచ్చంబెట్టవిత్తంబు ; గూ
దక నేఁటిని నుండఁగాఁగలను నా ♦ థా ! నీవె వాకుఁ ద్రిప్పుము.

సీ. సద్గుణుండొ శివ ♦ శంకరుండిట్టివా
డాయెగా నని వా ♦ క్యంబులకును
భూసురుండేమి ? యా ♦ రా సుర త్రాగుఁడే
మని పుకినున్న స ♦ జ్జనులనడిగి
విద్యాధికుండిట్లు ♦ వేశ్యలంగూడుచు
నెగడుటేమనియాడు ♦ సింవలకును
అఖిలశాస్త్రార్థ ర ♦ హస్యసంవేదియై
జూదమాడుననెడు ♦ వాదములను

తే. గీ. నెల్లు దలయెత్తి మెలఁగుదు ♦ నేమి సేతు
నెందుఁబోత్తును ; నామాట ♦ నింతయైన
జెవిని జేర్పక యుంటివి ♦ జీవితేశ
సకలమెఱిఁగియు నీభంగి ♦ సలుపనగునె.

(ఇంచుక యూరకుండి) నాథా ! నామాటలకుఁ బ్రత్యుత్తర మీయరేల ! మిమ్మనుసరించి తిరుగు స్నేహితు లెల్లగును ద్రవ్యాపేక్షచేతనే యని భావింపుఁడు. మీరు నిరసులయినచో మిమ్మఁజూచువారొక్కరు నుండరు. నాయందు గృపవహించి యీదుర్వృత్తుల మాని యాశంబుగనుఁడు.

శివ:—(ఇంచుక కోపమున)

ఉ. ఓసిదురాత్మురాల ! పడి ♦ యుండక యొక్కెడనాకునిట్లు, సే
బాసు భళావినీతులను ♦ బల్కఁగసాగితివేమనందు, రా

కాసివలెన్ నిరంతరము ♦ కానివిధంబునఁ జాలుఁ జాలు, నీ
వీసరణిన్ వచించుటది ♦ యెంతయునొప్పదు యూరకుండుమిా.

నాకు నీవు బుద్ధులు గఱపనేల. నాసంగతి నాకుఁ దెలియదా? అనవసరమైన విషయములందు నీవెప్పుడును జోక్యము గలిగించుకొనకుము. పొమ్ము. (నిష్క్రమించును.)

సత్య:—అక్కటా! నేనేమి సేయుదును.

(నిష్క్రమించును.)

---

రంగము:-[రాజవీధి:—సురాపానమత్తచిత్తుఁడైన శివశంకరుఁడు ప్రవేశము.)

శివ:—ఆహా! ఆకాశమున నక్షత్రమొకటియైనఁ గానిపించుట లేదు. మబ్బు దట్టముగ గ్రమ్మినది. ఏమి యురుములు! ఏమి మెరుపులు! నహ్వా! నగరమంతియు నిశ్శబ్దముగ నున్నది సుందరీ! సుందరీ! ఏమి మాట్లాడవు? అబ్బా! ఏమియలుక! నీ వలుక బూనిన నేను సైచియుందునని తలచితివా? నేమి? ఏదీ! ఇక మూరుబలుకక రమ్ము. అదిగో! విూయమ్మకు నల్లమందు అయి పోయినదనిగూ పలుకుచుంటివి. ఇంతేకదా! వెధవ నల్లమందు. ఇదిగో! ఈ రెండురూపాయలను తీసికొని దాసిని నల్లమందునకు బంపుము. తెలిసినదా? (పరికించి) ఏమిది! నే నిప్పుడెక్కడ నున్నాను. సుందరియింట్లో లేనే. జగమంతియు నిద్రించున్నదేమి? వెధవ సూర్యనారాయణను నేను సుందరియింట బ్రవేశించి యీడ్పించివేసినాను వానికిని నాకును నక్కకును దేవలోకమునకును నున్నంత భేదమున్నది. ఈ విషయమున సూర్యనారాయణ నన్నుఁగూర్చి యేమయినా కుట్రఁజేయునోఁ

చేయనీ! డొక్క బ్రద్దలుచేయనా? ఒరే! జాగ్రత్తగా మెలంగుము. (ఇంచుక నడచి) ఈశ్వర సృష్టియంతయుఁ జిత్రమే. అంతయు మాయయే. ఆపరమేశ్వరుఁడు జీవులను దోలుబొమ్మలుగఁ జేసి యాడించుచున్నాడు. నన్ను సుందరి నిశ్చయముగా దోలుబొమ్మగఁ జేసి యాడించుచున్నది. సుందరీ! నీవు జాణవు. నన్నుఁ గట్టివేసినావు. (నవ్వుచున్నాడు) నీవు వట్టి వెఱ్ఱిముండవు. కల్లకపటము తెలియఁగని యమాయకురాలవు. నిన్నుఁజూచిన నాకు మిగుల జాలికలుగుచున్నది. (ఏడ్చును) దైవంబు లందఱిలోను రాముఁడే మంచిదైవము. పిలువగానే పలుకును. (రామునినుద్దేశించి)

మ. అపరాధంబులవార్నిశంబులు మదీ ♦ యుండైన దుష్కృతిచే
విపరీతంబుగఁజేసినా డనుభవ ♦ ద్వ్యాఖ్యాతికారుణ్య దృ
ష్టిపథంబందున నన్నుఁ బెట్టి యిఁకఁ గ ♦ క్షింపంగ దేవిండి, నే
నపవిత్రుండఁ బవిత్రుఁ జేయుఁదగు రా ♦ మా! భక్తకల్పద్రుమా.

సెబాసు. పిలువగానే పలికినాడు. అదిగో! శివశంకరా! నీవు చేయుచున్నపని చాలామంచిదని పలుకుచున్నాడు. నిర్మలప్రకాశదాసు, వేమన్న మొదలగువారీమార్గముననే తరించిరని చెప్పుచున్నాడు. జాతీయాభ్యుదయ రహస్యమంతయు నిందే యున్నదనుచున్నాడు. (నడచుచు) ఎవరువారు? పలుకరేమి? (తొందరగా నడచుచుండగాఁ గాలికి దెబ్బతగులును) ఛేఛీ. రాయి ముక్కలయినది. రోగముకుదిరినది. నాశరీరము యుక్కువంటిదని దానికి తెలియలేదు. (కూర్చుండి తూలుచు) మనస్సు నిరంజనము. నిరామయముగా నున్నది (నేలపై వ్రాలును.)

[సత్యవతి—వెంకటలక్ష్మి—ప్రవేశము.]

వెంక:—తల్లీ! ఈ రాత్రి సమయమునఁ బడుచు లేచుచు నెంతయు వస్థఁబడుచుంటివమ్మా!

సత్య:—వెంకటలక్ష్మి! పార్వతీశ్వరునిపైనున్న భక్తి నాకీయంధకారము పంకు వెన్నెలవలెనే యున్నది. ఇంతకును నాధుఁడెచ్చట నుండునో కదా!

వెంక:—ఆయనయెక్కడ నుండును. సుందరియింటనే యుండును. మీచిత్తమున భయమందుమనుగాని, యాయనకేమియుభయము లేదు. (దిక్కులుచూచి) అమ్మా! చీకటిచే దిక్కులే కనిపించకయున్నవి. మబ్బుగూడ పేసినది ఆడవాళ్ళము వచ్చితిమి మనకేమి యాపద కలుగునో.

సత్య:—నిష్కల్మషచిత్తనగు నేనుండగా నీకుభయమేమి. ఆసుందరి యిల్లు యిక్కడకు దగ్గఱనే యున్నది.

వెంక:—ఆబోగము ముండ యింటికి మీరు పోవుదురా?

సత్య:—పోయినఁదప్పేమి నాథునికొఱకుఁగదా!

(శివశంకరుఁడు పడియుండును.)

శివ:—నాచిత్తమిప్పుడతినిర్మలముగ నున్నది. నేనిప్పుడు ధ్రువమండలమునుగూడ దాటిపోయినట్లున్నాను. అదుగో! నక్షత్రములు నన్నుఁజూచి తెల్లమొగములు వేయుచున్నారు.

వెంక:—(సత్యవతినిఁజూచి) అమ్మా! బాబుగారిమాటలవలె నున్నవి.

సత్య:—నేనును నదియే చూచుచున్నాను.

శివ:—ఎవరువారు చోరులా యేమి. ఈ శివశంకరుఁడు చోరులకును గీరులకును భీతిల్లువాడు కాడు. రండు నేనిప్పుడు సహస్రమద గజ సత్వుఁడనై యున్నాను.

సత్య:—వెంకటలక్ష్మీ! నాథుఁడే సందియములేదు. అక్కటా ఈతఁడిప్పుడున్న స్థితికేమని వగతును? (ఇంచుక యూరకుండి) ఇచ్చట విచారించుచు నుండనేల నెమ్మదిగా నీయనను గృహంబునకుఁ దోడ్కొని పోవుదము. (శివశంకరుని సమీపించి) నాథా!

శివ:—సుందరియా యేమి?

వెంక:—బాబూ! ఇట్లుంటిరేమి! ఎవ్వరైనఁ జూచిన నవ్వరా? ఇంటికిరండు.

సత్య:—

మ. అకటా! ఏమనిచింతఁబొందుదును నా ♦ థా మద్యమున్ ద్రావి జ్ఞ
ప్తికిదూరంబయి వెఱ్ఱివానివలె నీ ♦ వీథింబడంగాంచి జం
కక నింటంపదె సజ్జనప్రకర మిం ♦ కంజాగు సేయుంగ నే
టికి రారమ్ము గృహంబు జేరగను బా ♦ ధింపంగ నేలా ననన్.

నేను బ్రదికియున్నంతవఱకును మీరీ సురాపానము మానరు. మీరు సంపూర్తిగ నిందపాలుగాక మునుపే నేను మరణమందుట మంచిది.

వెంక:—అమ్మా! మీరీసమయమున నేమియు మాటలాడకుడు. (శివశంకరునిఁజూచి) బాబూ—రండి (చేయిబట్టుకొని లేవదీయును)

శివ:—నన్నెక్కడికి దీసికొనిపోవుదురు?

వెంక:—బాబూ! కేకలువేయకరండి. అమ్మా! మీరాప్రక్కనుండుఁడు.

(శివశంకరుని గృహమునకుఁ దీసికొనిపోవుదురు.)

---

రంగము:—[శివశంకరుని గృహము ప్రవేశము విచారముతో శివశంకరుఁడు.]

శివ:—(తనలో)

తే. గీ. కలధనంబెల్ల సవ్వార • కామినికిని
హితులకు; మధుపానమునకు • నించుకైన
వెనుకముందులు జూడక • వెచ్చఁబెట్టి
నాడ; నింకేమి గావించు • వాడ నిపుడు.

చేతధనంబున్నంతవఱకుఁ బూర్తిగఖర్చుపెట్టితిని. ఇప్పుడొక్క కాసైనఁజేతిలేదు అవసరమువచ్చినప్పుడొక్కకాసైనను గానిపించదు. ఇప్పుడవసరమునకై యెవ్వరినడుగుదును.

సీ. "బాగిందిపాపు" నకును • బాకీనిఁ దీర్పంగ
నప్పునచ్చెదు కొల్లు • నమ్మినాడ
యేలూరు ధనకాంత • యేతెంచినంతనే
పొలమమ్మి ద్రవ్యంబు • బోసినాడ
పిలునంగ స్నేహితుల్ • వీలుగాదనకేగి
ద్యూతమందున విత్త • మోడనాడ
నిమిషంబు నెడబాయ • నేరక సుందరి
కెంతో ధనంబును • నిచ్చినాఁడ

తే. గీ. నిన్ననమ్మితి మన్న స్నే • హితులకెల్ల
వలయు ధనమిచ్చి మోదంబు • గొలిపినాడ

చివఱ కొక రూక యైనను ♦ చేతలేక
వగపుఁ బొందుచు నీరీతి ♦ మిగిలినాఁడ.

అవసరమువచ్చినప్పుడు నాయొద్ద సొమ్ములేకపోయినప్పుడేదైన విక్రయించియైన నయవసరము గడుపుకొంటినిగాని, యెన్నఁడును నొరుల నడిగి యెఱుంగను. ఏదియైన విక్రయించుదమన్నను నేమియునులేదు. గృహము నా భార్యపేరనుండుటంజేసి దానిని విక్రయించుటకుఁ గాని, తాకట్టుబెట్టుటకుగాని నాకు స్వాతంత్ర్యములేదు. ఎవరిదగ్గఱకైనఁ బోయి ఋణమడుగుదమన్నచో, నే నాస్తినంతయు విక్రయించిన సంగతి యందఱును నెఱింగియుండుటయేగాక, యెన్నఁడును నప్పు నడిగి యెఱుంగని నేనిప్పుడడిగితినేని వారనుమానమందుదురు. అక్కటా! ఏమియును దోఁచకున్నది. రేపు సుందరియింట జరుగనున్న బంధువుల విందుకై సొమ్మిచ్చెదనని పలికితిని. దాని నెట్లీయఁగలను. నేటి దినమున మద్యపానమునకుఁగూడ డబ్బులేకున్నది కదా!

తే. గీ. వెలవెలందియింటను రేపు ♦ విందుకొఱకు
వలయు ద్రవ్యంబునీకున్న ♦ భంగనుగును
గాదె కార్యంబు; దానిపై ♦ గణికతల్లి
కాగ్రహంబుజనియించు నా ♦ యందుఁ నకట.

చదువుకొన్నది యగుటచే సుందరి సరసురాలు. నాయందతి గౌరవము, మోహము, ననురాగము గలిగియుండుటయే గాక, యెన్నఁడును గట్టిగా నోరువిప్పి యిదికావలయు నది కావలయునని యడిగి యెఱుంగదు. నేను దీని గృహమున నడుగుబెట్టకపూర్వము, దీని ప్రవర్తన యెట్లుండెనో తెలియదుగాని, నేను వచ్చిన పిదప, నితరపురుషులను గన్నెత్తియైనఁ జూడకుండెను. మాయా మర్మము లెఱుంగని

ముద్దరాలు. వేశ్యలలో నిట్టి సద్గుణములు కలదాని నెందును జూచి యెఱుంగను. అట్టిదాని కోరికల దీర్చకయుండుట నాకెంతయుఁ జిన్నతనము కదా. (ఇంచుక యూరకుండి) ఏవిధముగనైన నేడు నాతార్పుడునకును, సుందరి కొఱకును గొంతవిత్తము సమకూర్చవలయును. (ఆలోచించి) సరే! ఆలోచించుచు నిట్లుగూర్చుండినందువలన బ్రయోజనము లేదు. నాకిప్పుడొక చక్కని యుపాయము తోఁచినది. ఆయుపాయము సాగినేని యిప్పటి యవసరముతీరును. (ఎదుటఁజూచి) అదిగో! నాభార్య వచ్చుచున్నది. ఈమెయొద్ద నాతంత్రమును బ్రయోగింపవలయును.

[సత్యవతి—ప్రవేశము.]

సత్య:—(తనలో) ఏమి కారణమోగాని నేడు నాథుఁడు గృహము నందే యున్నవాఁడు. (పరికించి) దీర్ఘాలోచన తత్పరత యీతని మొగంబునఁ గన్పట్టుచున్నది. (సమీపించి) మనోహరా! అనుదినంబును నుండు సంతోషము మీ మొగంబున నేడు గానిపించక యుండుటయేగాక, యెందులకో విచారించుచున్నట్లున్నారు. ఈ సేవకురాలందులకుఁ గారణం బెఱుంగ నగునే?

శివ:—(తనలో) నాయుద్యోగమున నెమ్మదిగాఁ బ్రవేశించెదగాక. (ప్రకాశముగా) రమణీ! నేను వట్టి నిర్భాగ్యుడను.

మ. మదిరాక్షీ ఘనసాధ్వివైన నిను సం ♦ భావించుచున్ జూడకే
మదిరాపానమునన్ మెలంగి వెల భా ♦ మారత్నముం జేరి, దు
ర్మదమీకన్నుల గప్ప స్నేహితులఁ జే ♦ రందీసి నేడిట్లు గ
ష్టదశంబొందితి ద్రవ్యమంతయును, వె ♦ చ్చంబెట్టి నిర్భాగ్యతన్.

నాకు సురాపాన మలవడకపూర్వము నీవేమి సౌఖ్యమందితివో కాని, తరువాత, నేటివఱకును నీవు నావలన సౌఖ్యమే యెఱుంగవు. సాధ్వివగుటంజేసి, నేను సురాపానము సేయుచుండినను, వేశ్యా ప్రియుండనై యుండినను సైరించి నాసేవఁ జేయుచుంటివి. తరుణీ! నీ ఋణము నేనెన్నిజన్మములకైనను దీర్పఁజాలను. కాని నేను నీయెడల జేసిన దుష్కృత్యంబులను మఱచి నన్ను మాత్రము మఱచిపోవలదు.

సత్య:—నాథా! మీరిట్లు బలుకుటకుఁ గారణ మూహింపఁజాలక యున్నాను. అవిషయమై మీకిప్పుడేల చింతకలుగ వలయును.

శివ:—సర్వమునునైన పిదప చింతగాక మఱేమున్నది. ఇంక నాకు బ్రతుకునందే రోతపుట్టినది.

చ. పలికితివీవునాకుఁ బలు ♦ భంగులఁ ద్రాగుడు మానుమంచు నీ
పలుకులు విశ్వసింపక వి ♦ పద్దశ బొందితి నేమిసేతు నీ
పలుకులు సత్యమయ్యెఁ గుల ♦ భామననిన్ను నిరాదరించి; యా
వెలఁదిని సుందరిన్ మఱగి ♦ విత్తమునంతయు వెచ్చబెట్టితిన్.

సత్య:—(తనలో) ఇప్పటి కీతఁడు పశ్చాత్తాపమునందినాడు భగవంతుఁ డీతనికి నేటినుండి మంచి బుద్ధినిఁ బ్రసాదించుగాక (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! గతించినదాని కిప్పుడు విచారించి నందువలన బ్రయోజనమేమి యున్నది. ముందు కర్తవ్యమును జూడుము.

శివ:—కర్తవ్యమేమున్నది. ఇంక నెమ్మదిగా నేనీ ప్రపంచమునుంకి దాటి పోవుమార్గమును జూచుకొనుటయే కర్తవ్యము.

సత్య:—అక్కటా! ఎంతమాట చెప్పితిరి. ఈ దీనురాలు యట్టివి చూడగలదా? అయినను మీకిప్పుడంత యవస్థయేలవచ్చెను?

శివ:—రమణీ! సమస్తమెఱింగిన వాఁడనయ్యు కులధర్మమును మఱచి మద్యమునుద్రాగుచు వెలకాంతకుఁ జిక్కి సకల సంపదలను గోలుపోయితిని నిందయా వచ్చెను. ఇంక నేను జగంబునఁ దల యెత్తి యెట్లు మెలంగగలను.

సత్య:—నాధా!

చ. జరిగినదానికింగతి వి ♦ చారముజెందిన లాభమేమి; సుం
దరికిసి మీరొసంగిన ధ ♦ నంబును మిత్రులుగొన్న ద్రవ్యముల్
మరలలభించునే యికను ♦ మానసమందున ధైర్యమూని యే
కరణినొ వెళ్ళదీయుదము ♦ కాలము కాగలకార్యమద్దియే.

శివ:—ఇప్పుడునాకు వచ్చిన యాపదనుండి దాటినఁగదా కాలమెట్లో గడప నెంచుట.

సత్య:—ప్రాణేశ్వరా! ఉన్నదంతయు నైనపిదప నింకను నాపదయే మున్నది?

శివ:—కన్నుగానక చేసిన ఋణమునవలనఁ గలిగిన చిక్కులన్నియు దీరినవి; కాని యొకటిమాత్రము నిలిచిపోయినది. అయ్యది నేను నేటి సంధ్యాసమయములోపుగ నీయకయుంటినేని, వారు నన్ను న్యాయస్థానమునకుఁ గొనిపోవుదురు. దానివలన నేను నిన్ను మరలఁజూడగలుగుదునో లేదో యని విచారించుచున్నాను.

సత్య:—అది యేవిషయమైన ఋణమో యెఱుంగవచ్చునా?

శివ:—దుష్కార్యము లనేకములు చేసిన నేను నీయొద్ద సిగ్గువిడిచి యేల చెప్పకుందును? ఇయ్యది మద్యపాన విషయమై జేసిన ఋణమే.

సత్య:—నాథా! ఇంతవఱకును లోకులు మిమ్ము రహస్యముగ నేమని చెప్పుకొనుచుండిరి. ఇప్పుడు మీరీవిషయమునుగూర్చి న్యాయ స్థానమున కరిగితిరేని, లోకనిందకు మితిలేకయుండును. మీ కష్టమే నా కష్టము. మీ సుఖమే నాసుఖము. మీరు నాయం దింతవరకును నిరాదర భావము వహించియుంటిరిగాని, నేన న్నడును మీయందు హేయభావమున నున్నదాననుగాను. మిమ్ము సన్మార్గప్రవర్తనులుగాఁ జేయుమని నిరంతరమును నేనుపర మేశ్వరునిఁ బ్రార్థించుచున్నదాన. భగవంతుఁడు నాయందును గ్రహించి నేటికి మీకుఁ బశ్చాత్తాపముఁగలిగించినాడు. ఇకనై నను నాకు మీపాదసేవయొసంగి కృతార్థురాలిగఁ జేయుఁడు. ధనములేకపోయినచో బిచ్చమెత్తుకొనియైన సుఖముగాఁ జీవిం చవచ్చును. మీరు "అప్పులవారి" చే న్యాయస్థానమునకుఁ దీసికొనిపోఁబడుచుండ నేనుజూచి సహింపఁజాలను. ఋణ మొత్తమెంత?

శివ:—ఎంతయైననేమి? ఇప్పుడేమి చేయఁగలము?

సత్య:—కర్తవ్యమూహింతము. సెలవిండు.

శివ:—నాలుగువందల రూప్యములు.

సత్య:—అయినదానిలో నిదియొకటి మీకంటెనాకుఁ గావలసినదేము న్నది? మనోహరా! ఋణముతీర్చుటకు నాయొద్దనున్న కంటె యు, నొడ్డాణమునుదప్ప మఱేమియు లేవు. మీరు చెప్పిన మొత్త మున కివి సరిపోవును.

శివ:—(తనలో) నాచిత్తమునకిప్పుడు ధైర్యముకలిగినది. (ప్రకాశము గా) నారీమణీ! సిగ్గులేక నేనుజేసిన యకృత్యములు చాలవా? నీవస్తువులుగూడ విక్రయించవలయునా? చాలుఁ జాలు.

సత్య:—నాథా! మీరు సందియమందవలదు. మీయిక్కట్లుతప్పుటయే నాకుఁ గావలసినది. (వస్తువులదీసియిచ్చును.)

శివ:—హా! రమణీ! నేనెట్టి దారుణకృత్యముసేయుచుంటిని.

తే. గీ. విత్తమంతయుఁ బోయినన్ ♦ జిత్తమందు
చింతనందంగలేదింత ♦ చిగురుబోడి
భవ్యభవదీయ గళమున ♦ వస్తువులను
గైకొనిన యందులకుఁ జింతఁ ♦ గాంచుచుంటి.

కానిమ్ము భగవంతుఁడింకెటితోనైన మనకుసౌఖ్యము నిచ్చుఁగాక!

సత్య:—మీరు విచారింపక సత్వరముగ వీనిని విక్రయించి బాకీ నుండి విముక్తులుగండు.

శివ:—(తనలో) వీనిని విక్రయించి యిందు కొంత సొమ్మును సుందరి కిచ్చి మిగిలినది నామద్యపానమున కుంచుకొందుగాక తరువాత సంగతి జూచుకొందము. (నిష్క్రమించును.)

సత్య:—ఇప్పటికినేను ధన్యురాలనయితిని. పరమేశ్వరుఁడు నాయందు గరుణించినాఁడు. ఈవస్తువులు పోయినను నాకుఁ జింతలేదు. నాథుని యాపద తప్పుటయే నాకుఁ గావలసినది. నాథుఁడు మద్యపానమునకుఁ జేయించుకొన్న సువర్ణపాత్రను నేను దాచి తినన్న సంగతి యాతనికిఁ దెలియనేలేదు. కాలక్రమమున నీ విషయమై యాతనికిఁ దెలిపి రొసంగెదఁగాక!

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



# సువర్ణపాత్ర.



## చతుర్థాంకము.

రంగము:—[సుందరిగృహము—ప్రవేశము—మనోరమ]

మనో:—(తనలో) ఎవ్వాంతసేపయినా కూచోడానికి తీరుబాటులేకుండా వుంది. అస్తమానం ముసల్దాన్ని నల్లమందుకని వోసారి, పొగ సుట్టలకని వోసారి, కూరలకని వోసారి తిరగలేక సచ్చిపోతూ వుండాను. సచ్చిపోవడానికన్నా తీరుబడిలేదు.

(పోలిశెట్టి—ప్రవేశము.)

పోలి:—(మనోరమను జూచి) ఈవాళమనోరమ పూర్తిగా ముస్తాబయిందే!

మనో:—ఓహో! బావయ్యాగా రొచ్చారూ! ఈ ముస్తాబుచూసే నా నన్నెక్కిరిపిస్తున్నారు. మీకుమల్లే మాకుమంచి గుడ్డలు యేలావస్తాయి. సావుకారు గారు యిన్నాల్లనుంచి వత్తారన్న మాటేగాని కనిపెట్టుకోని వున్నదని ఒక కోకయినాకొని పెట్ట డంలేదు. మనోరమా అని పనొచ్చినప్పుడు మాత్రిం పిలుస్తారు.

పోలి:—నువ్వు మా పెద్దదానవు. నీకు కోకలకేవి తక్కువ. శివశంకరంగా రియ్యడం లేదా యేవిటి.

మనో:—ఆయునజోలి మీ కెందుకు. మిమ్మల్ని అడిగినాను. మీ దయ.

పోలి:—ఇంతేకదా! (ఇంచుకయూరకుండి) సుందరియేది. ఒకసారి పిలువు. మళ్ళీ నేను తొందరగా వెళ్ళాలి.

మనో:—మీ చేతులో పొట్లం యేవిటి.

పోలి:—నువ్వు సుందరిని పిలుద్దూ.

మనో:—(ఇంచుక నడచి) సుందరవక్కాయ్యో! బొర్రబావయ్యగారొచ్చారు.

సుంద:—(ప్రవేశించి) ఏమిటీ పిలుపు.

పోలి:—దానికి నా బొజ్జ చూస్తే వేళాకోళంగా వుంది. ఈమాత్రం బొజ్జ వుండబట్టే అన్నవస్త్రాలకు లోపంలేకుండా వుంది. లేకపోతే వుయ్యూరు పంతులు మోస్తరుగా శంకరగిరిమాన్యాలట్ట వలసిందే.

సుంద:—నవ్వింది. దానితో నేమిలెండి.

పోలి:—అబ్బే! నేను హాస్యానికన్నాను. దానిమాటలకేమి. ఇదిగో! పుచ్చుకో. (ఒకపొట్లము నిచ్చును)

సుంద:—సెట్టిగారూ? ఇదియేమి?

పోలి:—నిన్న చెప్పలేదా! ఈవాళ మాబుల్లోడికి అన్నం ముట్టించాము. ఏటికో యింట్లో చేసిన కొత్త పులిహోర, అరిసెలు. నీకోసం తెచ్చాను.

సుంద:—నామీద మీకు ఎంత దయ.

యమ్మ పోరాటముచే నట్టిది చెప్పలేక యూరకుంటిని. నాజన్మ యీక్షణంబువలన మిమ్మెడబాయను. మీరుగూడ నాయందట్లే నిష్కపటహృదయముతో మెలంగవలయును.

పోలి:—(తనలో) దీనికి నాయందు నిజమైనమోహమువున్నది. లేక పోయిన నిట్లుపలుకదు. కాకపోతేమేమిటి! ఎంతశ్రీమంతులైనా కోటిచ్చినట్లేమగలడా నేమిటి.

వాకో:—(ప్రవేశించి) సుందరవల్లియమ్మా. చివశంకరుడుగారొస్తు న్నారు.

పోలి:—కొంపమునిగిందే. ఇతడునన్ను చూచాడంటే బజారులో టముకుమూ వేస్తాడు.

సుంద:—మీరుభయమునొందనలదు. నేను బాకీవుండుటచే నడుగుట కువచ్చెనని చెప్పెదను.

(శివశంకరుడు ప్రవేశించును.)

శివ:—(పోలిసెట్టిని జూచి తనలో) ఏమిది! పోలిసెట్టి యిచ్చటనుం డెను.? ఈగండు సుందరిపై భ్రాంతిచే వచ్చియుండెనాయేమి ?

సీ. భాసురాలింగన ♦ మునయుగోలి జనియించి
బ్రాంతులై శ్రీమంతు ♦ పోయెనేమొ
మృదువైన మేనపై ♦ నాదిగోసి తామర
పైన మిగుల కోర్కె ♦ బరగెనేమొ
మధురభాషణముపై ♦ మనసు విసిగికప్ప
కొంప్పులపై గాంక్ష ♦ యలరెనేమొ
వరసుగంధాదిద్ర ♦ వ్యంబులసహ్యమై
నీకన్నులపై భ్రాంతి ♦ బారెనేమొ

తే. గీ. వివిధఫలహారముల్ గను ♦ వెగటుదోచి
పెనగగుగ్గిళ్ళపైఁ బ్రీతి ♦ యొదవనేకు
కాసులు మొహరీలపయినఁ ♦ నీసుగలుగ
పిచ్చికోలతపైఁ బ్రేమ ♦ వెలసెనేమొ.

కాకున్న నీపోలిసెట్టి యిట్యేడకు రాబనియేమి? సుందరీవిషయమై వారివీరిచే వినుచున్న మాటలంబట్టి నాచిత్తముక్కింత యనుమానముగనేయున్నది. (ఇంచుక ముందునకు నడచును.)

సుంద:—(లేచి పోలిసెట్టినిఁజూచి) సెట్టిగారూ! మీరాయు ప్రతిదినమును మాయింటిచుట్టును దిరగ నవసరములేదు డబ్బుఅందిన వెంటనే నేనేపంపుదును.

పోలి:—అబ్బో! ఇది మహాతమాషామనిషి. ఈ బ్రాహ్మడికి అనుమానం తగలకుండా యిల్లాఅంది. ఛీ, ఛీ దీనికితగినట్టు నేనుకూడా జవాబు చెప్పాలి (ప్రకాశముగా) ఈ మాటనుగా యెన్ని సార్లో చెప్పడమయినది. ఏలాభం ఇట్లాగయితే మేమేమివర్తకం చేస్తాము. (నిష్క్రమించును.)

శివ:—(సుందరిని జూచి) సుందరీ! ఈతని గోలయేమి?

సుంద:—ఏమి చెప్పుదును? శిసువు చచ్చినను సమున్నపు వాసన పోవ లేదనునట్లయినది. సూర్యనారాయణగారు మాకుఁ గావలసిన సామగ్రి వీరికొట్టునద్ద తెప్పించుమనుటవాడుక. మనోరమ వెళ్ళి కావలసినవస్తువులు తెప్పించుకొనుటంజేసి తన లెఖల యందు నాపేరు వ్రాసినాడు.

శివ:—ఇదియా యీతని రాకకుఁ గారణము (ఇంచుక యూరకుండి) ఒకవేళ పోలిసెట్టికిఁగూడ సుందరిపైఁ భ్రాంతిజనించెనేమో యని తలంచితిని.

సుంద:—(తనలో) ఈతఁడను మానమందెనా యేమి, అయిన నేమి? ఈతనిస్థితిగూడ మాఱినది. (ప్రకాశముగా) ఇన్నిదినముల నుండియు నాచిత్తవృత్తి నొక్కింతయు మీరెఱుఁగలేక పోతిరి కదా! మిమ్ములనే నమ్మియున్న నన్నీరీతిఁ బలుకఁజెల్లునా? చాలుఁ జాలు నాపై మీకిష్టము లేదేని వచింపుఁడు అంతియే గాని యిట్టి నిష్ఠురవాక్యము లాడవలదు.

సీ. నెలకుమున్నూను రూ ♦ కల నోసంగెదనన్న
సుబ్బరావును గంటఁ ♦ జూడకుండ
కోరిన కనకంబు ♦ గూర్పింతు నన్నట్టి
శ్రీధరరావును ♦ జేర్పకుండ
నీకార్య సాధంబు ♦ నిర్మించియిచ్చెద
నను భాగ్యవంతుల ♦ నరయకుండ
నొకనాటి పొందుకే ♦ యొప్పంగ గాసుల
నిచ్చెదమనువారి ♦ నెంచకుండ

తే. గీ. మిమ్మునమ్మిన యందుకు ♦ నెమ్మనమున
సందియంబంది నారిట్లు ♦ సరస చరిత
గాకయుండిన నిజముగా ♦ గణికవర్తి
నంబరయుశక్తుడైనె యా ♦ నలువయైన.

మాతల్లి నన్నన్ని చివాట్లు బెట్టుచుండినను మీయందు మోహము విడువలేక యుండిన కారణమున మీరిట్లనుమాన మందితిరి. మీరాపోలిశెట్టినిజూచి యనుమానమందినందులకు నవ్వువచ్చుచున్నది.

శివ:—నేను హాస్యమున కన్న పలుకులకింత యాగ్రహము బూనెద వేల? (ఇంచుక యూరకుండి) మీతల్లి నిన్నుఁ జివాట్లుపెట్టు

చుండెనని పలికితివి. నేను మీ విషయమునఁ జేసినలోప మేమున్నది. ఏనిముషమున నేది కోరిన నది నాశక్తివంచన లేకుండఁ దెచ్చియిచ్చుచునే యుంటిని. మొన్న మీయింట జరిగిన కార్యమున కాసమయమున నాయొద్ద సొమ్ములేక పోవుట చేతనే కదా నా భార్య కంటెయు నొడ్డాణమును. విక్రయించి నీ కిచ్చితిని.

సుంద:—మీరు లోపము జేసిరని నేను జెప్పియుంటినా ?

(తెరలో)

అమ్మాయీ ! ఆవిషయము వారితోఁ జెప్పుము. లేకపోయిన నెన్నాళ్ళని యీబాధతోఁ దీసికొనుచుందును ?

శివ:—అదియేమి ?

సుంద:—ఇంతిలో నవస్థ యేమనిచెప్పుదును. మాయమ్మకున్న యుబ్బసపుదగ్గు నిమిత్తమై వైద్యుఁడు నూరురూపాయ లడిగినాడట. దానింగూర్చి మీకుఁ దెలుపుమని చెప్పినది. కావున దయయుంచి యిదికూడ సానుకూలము జేయుఁడు.

శివ:—(తనలో) ఇంతతొందరలో నీసొమ్మెట్లు వచ్చును. (ప్రకాశముగా) రమణీ ! నిశ్చయముగా మీకీసొమ్ము అనసరమైయుండి యుండవచ్చును. కాని నాలుగురోజుల క్రిందనే నీకు మూడు వందల రూప్యంబు లిచ్చితిని. కావున, నిప్పుడే మరల నెచ్చట యింతసొమ్ము లభ్యమగును.

సీ. అడిగినంతనె మోద ♦ మందుచు వలసిన,
సద్వస్తువుల్ నీకొ ♦ సంగలేదె

చీరెసారెలకునై ♦ చేరికోరంగ బాల
మమ్మిద్రవ్యంబు నీ ♦ యంగలేదె
కట్టుకాసులపేరు ♦ కై పట్టుబట్టగ
గోరినవిత్తంబు ♦ గూర్పలేదె
వ్రతములన్నమటి ♦ దైవంబులన్నను
ఋణమైనఁజేసి ధనమీ ♦ యంగలేదె

తే. గీ. యింతయేటికి మొన్ననా ♦ కాంతదాల్చు
నగలగూడను దెగనమ్మి ♦ మగువమిన్న
వింధుకనికోరి నీకు నా ♦ నందమెసగ
నీయలేదె మరిలవిప్పు ♦ డెట్టులింత
సొమ్ము సమకూర్పగల్గుదు ♦ సుందరాంగి.

నే నిట్లంటినని నీవు కినుక బొందవలదు.

సుంద:—(తనలో) ఇంక నీతనివలన నొకకాసైన వచ్చుమార్గములేదు. నెమ్మదిగా మాయమ్మ చెప్పినట్లు చేయువలయును. నేను చెప్పుటకంటె మాయమ్మచేతనే యాతనికి స్వస్తివాక్యము శెప్పించిన బాగుండును. (ప్రకాశముగా) శాస్త్రిగారూ! వ్రేలుమడచి చెప్పుటకు వీలులేకుండ మీరు నన్ను గనిపెట్టిరని చెప్పుట కావంతయు సందియములేదు. కాని యిది యవసరమగుటచే మిమ్ము నడుగక తప్పదయ్యెను. కావున నాయందు దయయుంచి ప్రయత్నించఁ గోరెద.

శివ:—శక్తివంచన లేకుండఁ బ్రయత్నించెదను. పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

పరిచారి:—(ప్రవేశించి) అమ్మాయీ! శివశంకరుఁడు చెప్పుచున్నమాటలన్నియు వినుచునేయుంటిని. ఇంక నీతనివలన మనకేమియుఁ బ్రయోజనములేదు. నేనితనిని నెమ్మదిగా మనగృహమునుండి యుద్వాసనజేసెదను. రమ్ము. (నిష్క్రమింతురు.)

రంగము:—(రాజవీధిలో శివశంకరుఁడు ప్రవేశము)

శివ:—(తనలో) ఆహా! ఈవేశ్యలకెంతయిచ్చినను తృప్తిలేదుకదా!

మ. తనకున్, గోరినవెల్ల దెచ్చియిడ నీ తండంచు నొక్కింతయై
నను జిత్తంబున నెంచకుండనకటా ♦ నన్నున్ముసిందించెఁ ద
జ్జననిం జేరఁగఁజేసి; యీధరను వే ♦ శ్యలన్ దృప్తిఁబొందింప న
వ్వనజాతోద్భవుఁడైన శక్తుఁడగుచున్ ♦ భాసిల్లునే చూడఁగన్.

ఔరా! ఈసుందరి నాయందెంతయో యనురాగమున్నట్లు నటించుచు నన్నెంతమోసపుచ్చినది. వేశ్యలవ్యసనము సాపూర్తిగ నెఱింగినవాఁడనయ్యు, నావెలఁది మోహపాశమునఁ గట్టుఁగాఁ బడినవాఁడ నను గుండనుగాక ద్రవ్యమంతయు ఖర్చుపెట్టితిని. తినఁబోగ నునిమిత్తమై నానలసిన నూరురూప్యములను దెచ్చి యీయకున్నచో రావలదను నభిప్రాయము వృద్ధవేశ్య తనవాక్యములవలన స్పష్టపఱచెను. ఇందులకు సుందరిగూడ యామోదించినట్లేయున్నది. ఈసొమ్మునాకిప్పుడెట్లు లభ్యమగును? ఏమాయోపాయముచేతనైన భార్యయొద్దనే సంగ్రహింతమన్న దానిగళమున మంగళసూత్రము దప్ప మరేదియునులేదు. దానిపేరనున్న గృహమమ్ముమనిగాని, తాకట్టు బెట్టుమనిగాని బలవంతపఱచుట సమంజసమయినపనిగాదు. బ్రాందిపాపున కీయవలయునని చెప్పి తనయొద్దతీసికొన్న నగలమ్మి దుర్వినియోగము జేసితినని యామె గ్రహించి మిగులసంతాపమందుచున్నది. (ఎదుటఁజూచి) అదిగో

నామిత్రుఁడగు రామారావు వచ్చుచున్నాఁడు. ఈతఁడునాయవసరము నకైమైన నడ్డుపడునేమో.

(రామారావు—ప్రవేశించును.)

శివ:—(రామారావునుజూచి) ఓహో! మిత్రుఁడా! నీవెక్కడను గనిపించుటలేదేమి?

రామా:—శివశంకరా! కొన్ని గృహకృత్య సంబంధమైన చిక్కుల లోఁ దగుల్కొనియుంటిని అంతకంటె మఱేమియుఁ గారణము లేదు.

శివ:—నేనే నీకొఱకిప్పుడు రాదలఁచుచుంటిని. వెదుగబోయిన తీగయే పదములకుఁ దగిలినట్లు నీవేకనిపించితివి. నీవొక్క సహాయము నాకు నేడు సేయక తప్పదు.

రామా:—శివశంకరా! నీకంటె నాకు మిత్రులెవ్వరు. నీవిషయమై యెట్టి కార్యమైనను చేతనయ్యెనేని దప్పక సేయుదును.

శివ:—విశేషమైన పనికాదు. నాకు నూఱురూప్యములు కావలయును నీ వయ్యది ఋణముగా నొసంగితివేని మరల త్వరలోనే నీ కందఁజేసెదను. అత్యవసరమగుటచే నీకు శ్రమయీయవలసి వచ్చినది.

రామా:—(తనలో) ఈతని విషయమంతయు నాకుఁ దెలియుచునే యున్నది. ఉన్నదంతయు ఖర్చుపెట్టి యింకను సుందరితో నూగులాడవలయునని యున్నది. మొన్న భార్య వస్తువులను గూడ విక్రయించినాడఁట (ప్రకాశముగ) మిత్రమా! ఎన్నఁడును నొరులనడిగి యెఱింగినవాడవుకావున కొన్ని చిక్కులు నాకుఁగలుగుటంజేసి నాయొద్దనున్న సొమ్మంతయు ఖర్చుచేసితిని.

నీకది యొసంగలేనందుల కెంతయు విచారముగనున్నది. నన్ను గూర్చి మఱియొక విధమున భావింపక మన్నింపుము.

శివ:—(తనలో) ఈ కాలమున నీ మిత్రులందఱును ద్రవ్యమున్నంత వఱకును జేరువారే తనకు వలసినప్పుడెల్ల గావలసిన సొమ్మిచ్చితినని యైన భావించి కృతజ్ఞతఁజూపక యీతఁడిట్లు జెప్పినాడు. ఛీ! విశ్వాసశూన్యులగు నీమిత్రులంజేరి కన్నుమిన్ను గానక యిచ్చవచ్చినట్లు ధనవ్యయము జేసినందులకు నన్ను నేనే నిందించుకొన వలయును (ప్రకాశముగా) రామారాయా నీవిట్లు జెప్పుదువని నేను మొదటనే తలంచితిని. కానిమ్ము ఆ పదలెప్పుడును గాపురము సేయుము.

రామా:—నీవు కినుక బొందకుము నాస్థితియట్లున్నది. (ఇంచుకయూరకుండి) నే బోయివచ్చెదను.

శివ:—(తనలో) సుందరివిషయ మెట్లున్నను నేడు నా సురాపానమునకే డబ్బుకానిపించుటలేదు. కానిమ్ము నెమ్మదిగా గృహమునకేగి యీవిషయమై యేదియైన మార్గమునరయ వలయును.

(నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.



# సువర్ణపాత్ర.



## పంచమాంకము.

రంగము:-(శివశంకరుని గృహమునందు గదిలో ప్రవేశము శివశంకరుఁడు.)

శివ:—(తనలో) ఔరా! నాస్థితి యెట్లుమాఱినది? ఇట్లగునని కలనైనఁ దలఁచి యుంటినే? సంపద చంచలమనుమాట సత్యమయ్యెను. కాకున్నచో ననవరతంబును మహాభాగ్యంబుతో బహువిధ సౌఖ్యములనందుచుఁ జెలంగిన నేను నేఁటి కిట్టిగతి నందితిని? ఎన్నఁడును నొక్క యరకాసయిన యాచించి యెఱుఁగని నేను నామిత్రు లందరియొద్దకును బోయి యీసమయమున కొంతద్రవ్యమును గూర్చి వారి సహాయ మపేక్షించితిని. ఒక్కరును నాకుఁ దోడ్పడరైరి. విశ్వాసశూన్యులగు వారితో మైత్రిపాటించి నేను మోసపోయితిని.

తే. గీ. ఇంతగతిగల్గిననుగాని ♦ స్వాంతమింత
యైనది గణికపై విముఖత్వ ♦ మందకుండె

నేమిసేయుదు నింకనే ♦ నెట్లుదాని
కేరుదును దీనికి మంచి ♦ దారియేది ?

ఎంత ప్రియత్నించినను ద్రవ్య మెచ్చటను లభ్యముకాలేదు. నే ననుదినమును మధుపానము సేయువేళ గూడ సమీపించినది. ముందు దీనివిషయమై యాలోచించ వలయును. (ఆలోచించి) ఇంక దీర్ఘాలోచనము సేయుచుఁ గూరుచున్నందు వలనఁ బ్రయోజనము లేదు. (ఎదుటఁ జూచి) అదిగో ! నాభార్య వస్త్రములపెట్టె తెఱచి యున్నది. ప్రస్తుత మిందుండు దాని విలువగల చీరల గొనిపోయి, సారాదుకాణమువద్ద కుదువంబెట్టి నాయక్కఱఁ దీర్చికొందు గాక.

(ఇటునటుఁ జూచుచు నెమ్మదిగా పెట్టియొద్దకుఁబోయి తెఱచి)

ఇదిగో ! ఇత్యాది నేను వారణాసీ పురమునుండి తెప్పించిన చీరె. దీనివిలువ డెబ్బదిమైదు రూపాయలు. పదిరూపాయలైన నాకు రాకుండునా ? ఇది దక్షిణాది చీరె. దీనిని సుందరికిచ్చెద. ఇంక నాలసించితినేని, దొడ్డిలోఁ బనిజేసికొనుచున్న నాభార్యవచ్చును. (చేరలను దీసికొని పెట్టె మూతవేయుట మఱచి నిష్క్రమించును)

పత్ని:—(ప్రవేశించి) మూడు నాలుగు దినంబులనుండి, నాథుఁడేవిష యమునకో దీర్ఘాలోచన సేయుచు బెంగగొని యున్నాడు. (ఆలోచించి) కారణ మేముండును ? ధనము లేకపోవుటయే విచారము. (పరికించి) ఏమిది ! ఇంతకుమున్న ప్రాణేశ్వరుఁ డిచ్చటనే యుండెనే ? చెప్పకుండ నరిగనేమి ? (పెట్టెనుజూచి) ఈపెట్టె నెవ్వరు దెఱచిరి. (సమీపించి) దీనిమూత తీసియు న్నది (పరికించి) ఇందు చీరెలుండవలెనే ! గదిలోని కన్య లెవ్వరు వచ్చియుందురు ? (ఆలోచించి) ఇది యన్యులుచేసిన పనికాదు. అక్కటా ! నానాధుని చిత్తము తుదకిట్టి దుష్కృ

త్యముల సేయుటకు బాల్పడినది? ప్రాణేశ్వరున కవసరము వచ్చెనని తలంచి నావస్తువుల నొసంగి, సత్ప్రవర్తనయందు దన చిత్తమును మఱలించుకొనునని తలంపగాఁ నావస్తువుల విక్రయించి యాధనమును దుర్వినియోగము జేసెను. జన్మమున్నంతవఱకును వేశ్యా సురాపాన పిశాచంబు లీతనిని వదలునట్లు గానిపించదు. ఇంక నే నేమిసేయుదును? ఈసురాపాన మెందఱికొంపలార్పినది? ఎందఱిని దుర్బలులంజేసి ప్రాణములు దీసినది? ఎందఱికి గౌరవంబును బోగొట్టినది. ఈసురాపానపిశాచ మీ భారతవర్షమును నెప్పుడు విడిచిపోవునో కదా! ఓ సంఘ సంస్కరణాభిలాషులారా! మీ రేమిసేయుచున్నారు. మద్యపానమేల నిషేధింపరు. ఈవిషయమై పట్టుదలఁ బూని పనిజేసి భారతవర్షము నుద్ధరింపరు. సురాపానముతోఁ బాటు వేశ్యల నృత్యములఁ గూడ మాన్పించి, వారికి సద్బోధగావించి సంసారిణులుగఁ జేసి పుణ్యము గట్టుకొనుడు. పవిత్రమైన యీ భారతవర్షమున కీ మద్యము వలనను, వేశ్యల వలననే కళంకము వచ్చుచున్నది. మాతృదేశోద్ధారకులగు మీరీ విషయంబులయందు గంకణముల ధరించి పనిసేయుడు. (ఇంచుక యూరకుండి) విలువగల చీరెలను నాథుఁడు గొనిపోయినందులకు జింత లేదు; కాని యట్టి మహాభాగ్యముతో దులదూగిన యీ తత్ వస్త్రములను మధుపానార్థమై వినియోగపఱచుట లోకులు జూచెదరేమో యని చింతించుచుంటిని.

(ముకుందశాస్త్రి—ప్రవేశము.)

ము శా—(తనలో) అక్కటా! నామిత్రుఁడగు శివశంకరున కెట్టిస్థితి వచ్చినది? ఈమాట వినినచో సాధ్వియగు నీసత్యవతి యెంత

చింతించునో కదా! ఇప్పుడు నేనీవార్త యీమెకుఁ జెప్పక పోయినను నింక కొంతసేపటికైనను దెలియక మానదు. కావున నీమెకుఁజెప్పి, మిత్రునిపై నారోపింపఁబడిన యీనింద బోగొట్టి కారాగృహ విముక్తుఁడగుటకు బ్రయత్నించెద గాక. (ప్రకాశముగా) అమ్మా! సత్యవతీ!

సత్య:—సోదర సమానులగు ముకుంద శాస్త్రిగారా! దయచేయుఁడు

ముకుం:—అమ్మా! నీవునాకు సోదరిసమానవు. శివశంకరుఁడు నా కత్యంత సఖుఁడు. నేనెప్పుడును నాతనిశ్రేయమును గోరుచుందును. నేనాతని కనేకసారులు సదుపదేశమును జేసితిని; గాని నావచనముల వలన నినియోగము లేకపోయెను. (ఇంచుక యూరకుండి) జరిగినదానిఁగూర్చి యిప్పుడు తలపోసినామువలన లాభము లేదుగాని, ప్రస్తుతమాతనికి సంభవించిన యిక్కట్టునుగూర్చి విచారింపవలయును.

సత్య(ఆతురతతో) అన్నగారూ! అదియేమి? ఇంతకుముందే నా మనోహరుడు గృహమునుండి వెళ్లెను.

శివ:—అమ్మా! దైవము శివశంకరునిమీఁద యింతకపగా నిష్ఠురత్వ మువహించినాడు. సుందరియింటికి పోలీసువారువచ్చి, దానింట నున్న సువర్ణపతకము నొంటుగైకొని యదియెక్కడనుండి దానికివచ్చెనని యడిగిరి శివశంకరుఁడొసంగెనని సుందరిచెప్పగా, నాసమయమున నచ్చటనేయున్న శివశంకరునివారు బంధించుకొని కారాగృహమునకుఁ గొనిపోయిరి.

సత్య:—అయ్యో! పాణేశ్వరా! ఈకర్మమేమి? (తనలో) ద్రవ్యమంతయు నీవువెచ్చించినను నేను విచారింపలేదు. నానగలను గొని

పోయివిక్రయించి యాసొమ్మునుసురాపానమునకును, వేశ్యలను నొసంగినను చింతిపలేదు. తుదకునేటి దినమున నింటనుండు పట్టుజీరెలు పోయినను నేడ్వలేదు. నాథా! ఈమధుపానము నిన్నెట్టి దురుద్యోగమున బ్రవర్తింపజేసినది. అక్కటా! చౌర్యవృత్తినిగూడ బ్రవేశించినందులకు నేనేమని చింతింతును? భాగ్యమంతియు నడుగంటినను నీవుసన్మార్గవర్తివైయుండినం జూచి సంతోషింపదలంచితిని. (ఇంచుక యూరకుండి) ఇంక నాగుండెను రాయిజేసికొని నిన్నుగూర్చి మఱియేవార్తలను వినకపూర్వమే ప్రాణములం బరిత్యజించుట మంచిదిగాందోచు చున్నది. (ప్రకాశముగా) అన్నయ్యా! నాహృదయము పాషాణము యినది. ఇంక నేనేమి చేయవలయునో నాకుందోచకున్నది. ఈసమయమున నానాథుని ననుసరించి ద్రవ్యాపేక్షచేం దిరిగిన హితులెవ్వరును నగపడరు. నానాథునివిషయమై నేనుపడుచున్న కష్టములన్నియు మీరెఱింగియున్నారు. మీరు నానాథుని శ్రేయముగోరినవారలు. మాయందు వాత్సల్యముంచి నానాథుని రక్షించుట కేదయిన మార్గమున్నరయుండు. లేనిచో, నేను భగవత్సాన్నిధ్యమునం జేరి సుఖించెదను. ఈసమయమునకేమైన ద్రవ్యము గావలసినచో నాపేరనున్న యీగృహము నమ్మి నాథునివిషయమై వినియోగపఱచెదను. అతనిసేవకంటె నాకుంగావలసినదేమియునులేదు.

శివ:—

మ. గరితా సాధ్వివటంచు నిన్నుం బలుకం • గాజెల్లుగాకున్నచో
నిరతంబున్ మధుపానచిత్తుడగుచున్ • విత్తంబు వెచ్చించి మం

దరులంగూడి చరించు భర్త కయి సం ♦ తాపంబు నీభంగి నే
తరుణీరత్నములొందు నీకలిని స్వాం ♦ తంబందు యోచింపఁగన్.

సాధ్వీమణీ! నీసత్ప్రవర్తనయే నిన్ను రక్షించుగాక అమ్మా! నీవు విచారించవలదు. నాశక్తినంతయు వినియోగపఱచి యందలి సత్యమరసి మిత్రుండగు శివశంకరుని గారాగృహవిముక్తునిగాఁ జేయుటకుఁ బ్రయత్నించెదను నీవు ధైర్యమున నుండుము.

సత్య:—అన్నయ్యా! నీవు నాపాలిట దైవంబనినమ్మి యున్నాను.

సీ. శివశంకరుండిట్లు ♦ జేసినాడనుపట్టి
యపనింద యాతని ♦ నందకుండ
పాత్రేశ్వరుండట్లు ♦ బంధింపఁబడెనంచు
నెంచినేను మృతిని ♦ గాంచకుండ
వాసికెక్కిన మేటి ♦ వంశగడంబూరు పే
రులులేకమన్నన ♦ గలియకుండ
సాటిబంధువులెల్ల ♦ బాటించి యీమాట
బరిహాసమును జేసి ♦ పలుకకుండ

తే. గీ. నీదుసఖునిపై వచ్చిన ♦ వాదుబాపి
చెఱనుదప్పింప యత్నింపు ♦ శిష్టచరిత
నీకుఁబుణ్యంబు గలుగును ♦ నిశ్చయముగ
దిక్కులేవట్టె నాకీవె ♦ దిక్కుసుమ్మ.

ముకుం:—సోదరీ! నీవడలకుము మధ్యాహ్నము నెమ్మదిగా మన మిరువురమును గారాగృహము వద్దకుఁబోయి శివశంకరునిఁ జూతము నేపోయివచ్చెద. (నిష్క్రమించును.)

(తెరవాలును)

ఇది పంచమాంకము.



# సువర్ణపాత్ర.



## షష్ఠాంకము.

రంగము:—[చెఱసాల-విచారముతో శివశంకరుఁడు ప్రవేశము]

శివ:—(తనలో)

ఉ. బ్రాహ్మసురవంశమందు మణి ♦ కైవడి జన్మము నందియున్ దుర
భ్యాసము జేసి మద్యమును ♦ పానముసేయుట యంతబోక వే
శ్యాసతిపైన మోహమున ♦ సంపదలన్నియు నేలగల్పి యా
హా! సరివారలెల్ల బరి ♦ హాసముసేయగ నిట్టులైతిగా.

సీ. మతధర్మములనెల్ల ♦ మన్నులోపల గల్పి
సురను సేవించుచు ♦ దిరిగినాఁడ
గౌరవంబంతయు ♦ గానపాల్గావించి
వెలవెలందులఁగూడి ♦ వెలసినాడ
పూర్వార్జితంబైన ♦ భూములన్నియు నమ్మి
కడుదరిద్రుఁడనౌచు ♦ గ్రాలినాడ
సత్కులోద్భవయైన ♦ జాయచిత్తమునకు
దీఱని దుఃఖంబు ♦ దెచ్చినాడ

తే. గీ. చేయవలసిన దుష్కృతుల్ ♦ చేసినాఁడ
నందవలసిన దుర్యశం ♦ బందినాఁడ
దుదకు నేటికిఁ గీర్తిని ♦ దొంగయనుచు
క్షితినినిందఁ బొందగ జెఱం ♦ జిక్కినాఁడ.

అక్కటా! ఇప్పుడు వచ్చిన యాకారణాపరాధ స్థాపనకు నే నేమని వగతును. ఆసువర్ణరత్నపతక మెట్టిదో నే నెన్నఁడును నెఱుంగను. దాని నాసుందరి కేవిటుఁడిచ్చెనో కదా! ఆవిటుఁ డెట్లుసంగ్రహించి తెచ్చెనో! పోలీసువారువచ్చి దాని నడిగినప్పు డాయపరాధము నాపైనేల స్థాపించెను. తనయెడల ననురాగము వహించి యెంతయో ధనము వెచ్చించితిననియైన దలంపక నన్నుఁ జోరునిగా జేసిన యాసుందరి నేమందును? నన్నిట్లయిన నిల్లు వెడలనంపుట కిట్లు నేరము నాపైఁ జెప్పెను. ఔరా! ఎంతసాహసము.

మ. తలపెల్లప్పుడు నీపయిన్ నిలచుఁ జి ♦ త్తంబందు సంచున్ మదం
బలరన్ దీయనివాక్యముల్ బలికి, ద్ర ♦ వ్యంబాతె యున్ లాగి; యె
ట్టులో యిల్లున్ వెడలంగఁ జేయఁగను ♦ నిట్టుల్ మాయలంబన్న, నీ
వెలవాల్గంటియటంచు నామదిని భా ♦ వింపంగ లేదెప్పుడున్.

ఆహా! వేశ్యా వ్యామోహమువలన నిట్టిదికదా సుఖము. చేతులార నేను చౌర్యముచేసి యానగ నేను దానికిఁ దెచ్చి యిచ్చియున్నచో నాకీవిచారమే యుండదు. ధనమున్నంత వఱకును నెమ్మదిగా లాలించి గ్రహించినది. సురాపానమువలనను, నీవేశ్యవలనను సంపూర్తిగఁ జెడినాఁడ. ఇప్పుడు నే నేమనుకొన్న నేమిప్రయోజన మున్నది? నే నెట్టి దుష్కార్యము లాచరించుచుండినను, నిసుమంతయుఁ జిత్తమున నలుకఁబూనక నిరంతరము నాశ్రేయ మభిలషించుచు, నాకు

నీతులం గఱపుచు, నాసేవలఁజేయు సంతసించు నాభార్య యీ వార్తవిని యెట్లు బరితాపమందుచున్నదో కదా!

సీ. కల్లనైననామాట ♦ గాదనివచియించి
యెఱుఁగనియట్టి, ప ♦ ర్వేందువదన
యెట్టిదుష్కృత్యంబు లేను ♦ సల్పినగాని
మదినైనరోయని ♦ మగువమిన్న
నాక్షేమమశాంతి ♦ మీక్షించుచును మంచి
నీతులం గఱపెడి ♦ నీరజాక్షి
పతికంటెవేఱు దై ♦ వంబులేదని నాకు
సేవలజేసెడి ♦ చిగురుబోడి

తే. గీ. ప్రేళ్ళఁ జూపింపబడక యొ ♦ ప్పినయరుంధ
తీతలోదరి కీర్తైన ♦ దివ్యచరిత
యట్టి నాసతినన్గూర్చి ♦ యకటయెట్లు
గుందుచున్నదో గద తన ♦ డెందమందు.

(ముకుందశాస్త్రి సత్యవతితో ప్రవేశము)

ముకుం:—(తనలో) అక్కటా! ఎట్టివానికెంత గతిపట్టినది. పూర్వకృత పాపంబు ననుభవింపక తీరదుకదా.

సత్య:—(తనలో)

మ. అకటా బ్రాహ్మణవంశమందు నుదయం ♦ బై; సత్కులాచార
మెంచక మద్యంబునుద్రావి సంతతము వే ♦ శ్యాలోలతన్ జిక్కి జం
కక ద్రవ్యంబును వెచ్చబెట్టి తుదకీ ♦ కారాగృహంబందు నే
టికిఁ జోరుండనిగూడ సజ్జనులు బా ♦ టింపంగనేఁ జిక్కితిన్.

నాథుని కెట్టికష్టము వాటిల్లినది.

శివ:—(పరికించి తనలో) నిరంతరము నా శ్రేయముగోరుచుండు మిత్రుండగు ముకుందశాస్త్రియు, నాభార్యయు నన్నరయుటకు వచ్చున్నారు. అక్కటా! నాభార్య మొగమెట్లుజూతును. మిత్రునితో నెట్లుమాట్లడుదును. వీరు నిశ్చయముగ నేనట్టి చౌర్యముచేసి యుందుననియే తలంతురుకదా!

సత్య:—(సమీపించి) హా! నాథా! నీకీగతి సంభవించుటేమి! సంతాపవార్థియందు నన్నుముంచి నీవిట్లుండుట తగునే!

శివ:—(భార్యనుజూచి)

ఉ. చెప్పితివీవు దుష్క్రియల ♦ జేయుట మానుమటంచు నాకు నీ
చెప్పినవాక్యముల్ చెవిని ♦ జేర్చక సంతసమునన్ జరించుటన్
ముప్పొనగూడెనాకు; జగ ♦ మున్ గని చోరుడనంగ నేను నే
నిప్పగిదిన్ జెఱంబడితి ♦ నేమనువాడ నుదలోదరీమణీ.

ముకుం:—మిత్రమా!

శివ:—సఖుడా! ముకుందశాస్త్రీ!

చ. పరమహితుండవీవు పలు ♦ భంగుల నాదగు సేమమే నిరం
తరమునుగోరుచుండి ధన ♦ తామరసేక్షణగూడి యుంట దు
స్తరకలుషంబటంచును హి ♦ తంబును జెప్పితివీవు దాసనే
నరయక వేశ్యమూలమున ♦ నైతినినీగతి మిత్రరత్నమా.

నీవెన్ని యుత్తరములు జెప్పితివో యన్నియు జరిగినవి నీహితోపదేశము దృణీకరించినందులకు ఫలమనుభవించినాను. నాపూర్వార్జితంబైన సంపదలును పోయినందులకు విచారింపను. గణికావ్యామోహామాది దుష్కృత్యంబుల నగుల్కొని గౌరవంబంతయు బోగొట్టికొనినందులకు దుఃఖింపను నిరంతర మదీయచరణ సంసేవాసక్తయు,

సాధ్వియునగు నాభార్యను నిరాదరించుచు నామెకు వగపుఁగూర్చి నందులకుఁగూడ జింతింపను కాని యీకారణముగ సువర్ణరత్నపతకము దొంగిలించినది నేనేయని నన్నిందు బంధించినందులకు మాత్రము వగచు చుంటిని.

ముకుం:—మిత్రమా ! దొంగతనము దాగదుకదా ! అదిచేసినవా రెప్పటికైనఁ బట్టువడి తీరెదరు.

శివ:—నేనట్టికార్యము జేసితినని నీవు విశ్వసించితివా ?

ముకుం:—

తే. గీ. మద్యమునుద్రావి వేశ్యల ♦ మఱిగి ధనము
నంతయును గోలుపడి రిక్త ♦ హస్తుడైన
వాఁడు ; తుదకు నిట్టిపనుల ♦ భావమందు
భయముగానక చేయుచుఁ ♦ బఱగుఁగాదె.

శివ:—మిత్రమా ! నీవుచెప్పిన మాట నిశ్చయమే. కాని యీచౌర్యము నావలన జరిగినదికాదు.

సత్య:—నాథా ! ఇందలి నిజమెట్టిదో వచింపుఁడు. నాకు భ్రాతృసముఁడును, మీకు నితాంతాప్తుఁడును నగు నీ ముకుందశాస్త్రి మనకీసమయమున దోడ్పడును.

శివ:—నారీమణీ ! విత్తమంతయు సురాపానమునకును, సుందరికిని వెచ్చపెట్టి, చేతనైన నొక కాసైనలేకపోయినను సుందరిపై మోహమును మాత్రము విడువజాలక దానిగృహంబుననుండఁగా, బోలీసువారువచ్చి దానిల్లు వెదకి, పేటియందున్న యొక సువర్ణరత్నపతకమును దీసికొని యది యెక్కడనుండి నీకులభించెనని దానినడిగిరి. శివశంకరుఁడిచ్చెనని సుందరి వారికిఁ

చెప్పినంతనే వారునన్ను బంధించి తెచ్చిరి. ఇంతకుదప్ప నేనా వస్తువువిషయమై యేమియు నెఱుఁగను.

ముకుం:—మిత్రమా ! వేశ్యలెంతకయినను జాలుదురు. ఆవస్తువు దాని కెవ్వరో సామాన్యవిటు చొక్క డెక్కడనో దొంగిలించి తెచ్చి యిచ్చియుండును. నిన్నెట్లయిన నిల్లువెడలనడుపుట కిట్లు జేసినది. కానిమ్ము. ఇప్పుడు విచారించినందువలనఁ బ్రయోజనమేమియు నులేదు. నేను నిన్ను "జామీను" పై విడుదలచేయించి, యొక న్యాయవాదిని నీపక్షమున నేర్పరచి న్యాయస్థానమున వాదింప జేసెదను. నీవు విచారించక ధైర్యమునవుండుము.

శివ:—ముకుందశాస్త్రీ ! నీతోనేమని చెప్పుటకును సిగ్గుగనున్నది.

ముకుం:—శివశంకరా ! నీవు నావిషయమై సందియంబుఁదఁ బనిలేదు. నాశక్తివంచనలేకుండ, నీకే యపరాధదోష మంటకుండనుం డునట్లు బ్రయత్నించెదను.

సత్య:—అన్నయ్యా ! అన్నింటికిని నీవేయుంటివి.

శివ:—రమణీ ! నీవు నాస్థితికి వగచుచు నిద్రాహారములు మానియుం డవలదు. ఎవరిదుష్కర్మము వారనుభవింపవలయును.

సత్య:—నాథా ! నీవు చెఱనుండి యీవలకువచ్చునరకును నాకునిద్రా హారములతో నేమిపని.

(పోలీసు-భటుఁడు-ప్రవేశించును.)

పో-భ:—అయ్యా ? మీరిక్కడనింక మాటలాడుచుండ వలనుపడదు. కారాగృహరక్షకాధికారి వచ్చుచున్నాఁడు.

శివ:—ముకుందశాస్త్రీ ! పోయిరమ్ము.

సత్య:—నాథా ! పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

(తెరవాలును)

రంగము:—(రాజవీధి:-ప్రవేశము:-సూర్యనారాయణ)

సూర్య:—(తనలో) అక్కటా! నాస్థితికి నేనేమని వగతును? ఆసుం దరిట్లు జేయునని కలనైనఁ దలంపలేదు.

సీ. వారాంగననుజేరి ♦ బంధువుల్ నిందింప
పరమనీచుండనై ♦ తిరిగినాను
సుందరిఁ గేగంటి ♦ చూపుల నీక్షించి
వెఱ్ఱిమానిసివోలె ♦ వెలసినాను
చిత్తమెప్పుడు నిన్నె ♦ చేరనెంచు నటంచు
బలుకంగ నెంతయు ♦ గులికినాను
కపటానురాగంబు ♦ గాంచజాలక
మోహసాగరమున ♦ మునిఁగినాను
తే. గీ. ద్రవ్యమంతయు దానికి దారవోసి
సాటివారెల్లరు బరిహా ♦ సంబుజేయ
నకట! తుదకు బొట్టకునింత ♦ యన్నమైన
గాంచనేరని దుర్గతిఁ ♦ గాంచినాను.

నాకుఁ దెలియకుండ నాసుందరి శివశంకరుని జెట్టపట్టి నన్నిల్లు వెడలనడిపినది. ఆ శివశంకరుని యెడల మాత్రము స్థిరచిత్తముతో నుండెనా?

తే. గీ. చిక్కినంతవఱకతని ♦ చేతనున్న
ద్రవ్యమంతయు లాగి తు ♦ దకు గృహంబు
నుండి వెడలఁజేయంగ జో ♦ రుండనంగ
బట్టియిచ్చెను వానిని ♦ బాపచరిత.

నిశ్చయముగా శివశంకరుఁ డావస్తువువిషయమై చౌర్యము చేసెనని తలంపను. పాపమాతఁడుగూడ తుదకు నాస్థితికేవచ్చెను. పాపము ఏది యెట్లయినను నీతనిపై మోపఁబడిన నేరమేమగునో కదా! అదివిచారణజరుగుట నేడేకదా! ఆహా! వేశ్యల మూలమున నెన్నెన్ని కొంపలు మాసిపోయినవి. సమస్త ధర్మాధర్మవిచారణ దక్షులును, సకలశాస్త్రపారంగతులునైనవారే వేశ్యా వ్యామోహమునబడి లోకనిందకు పాలగుచుండిరి కదా! ఈ వేశ్యలయందుండు వ్యభిచారవృత్తి మానిపించి వారికి సద్వృత్తినలవడఁజేయు మహనీయులగు సంఘసంస్కరణపరాయణు లేమూలనుండిరోకదా! ఓ వేశ్యాభుజంగులారా!

సీ. అగ్నిసాక్షిగఁ గొన్న ♦ యతివలింటను నుండ
బణ్యకాంతల జేరు ♦ పాపులార
వారకాంతలపొందు ♦ పరమమోక్షమటంచు
నెంచిచరించెడు ♦ హీనులార
మాయవేశ్యలతీయ ♦ మాటల కుబ్బి తె
బ్బిబ్బుజెందెడి కుపి ♦ వేకులార
వెలవెలందులకల్ల ♦ ప్రేమకునాశించి
కుక్కలై తిరిగెడు ♦ కూళలార
తే. గీ. ఇంకనైనను మీరలా ♦ వంకబోక
యుండుడీయని ప్రార్థింతు ♦ నొప్పమీఱ
భోగకాంతలనమ్మియే ♦ జోగినైతి
గానవచియించినాడను ♦ దీనివినుఁడు.

(పోలిసెట్టి—ప్రవేశము.)

పోలి:—(సూర్యనారాయణను జూచి) ఏవండోయి సూర్యనారాయణగారు మహా కేకలేస్తున్నారు.

సూర్య:—ఏమియున్నది ? నీకింకను ననుభవములోనికి రాలేదు. ఆకారణముచేత, సుందరిని పట్టుకొని వదలక యున్నావు.

పోలి:—అదేమిటండోయి. సరసాలు.

సూర్య:—నీవు దాచినను దాగునా ? నెమ్మదిగానీవు సుందరివలలోనం బడినావు. నాకును శివశంకరునకును నెట్టిగతి బట్టినదో, నీకు నదియే కొన్నిదినములలో ప్రాప్తించును. ఇంకనైనను నీవా గృహముచాయకు బోవక యుండుము. (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నీవెక్కడనుండి వచ్చుచున్నావు ?

పోలి:—కోర్టుకాడనుంచి. ఈవాళ శివశంకరుడుగారి కేసు వాయిదాగా

సూర్య:—న్యాయం భగవంతుడు పాలించడూ ! ఎవరో గిట్టనివాళ్ళు అనస్తున ఆయన యెత్తుకొని పోయినాడంటే సరా. జడ్జీగారు కేసు కొట్టేశారు.

సూర్య:—పాపము. అకారణనిందమాత్రము భరింపవలసి వచ్చినది. పోనిమ్ము. కృతార్థుడైనాడు.

పోలి:—సరేగాని, సుందరియింటి కెచ్చాలువాడిన బాపతు బాకీ ఫయిసలు చేయించావు కావయ్యా మొత్తానికి.

సూర్య:—ఇంకను నన్నేలపీడించెదవు ? సుందరినే నీయధీనము జేసితిని.

పోలి:—(తనలో) సుందరి యింటికి నేను వెళ్ళుచున్నానని అందరికీ తెలిసిపోయింది. శివశంకరుడి సంగతిలో ఆముండే చాలా అన్యాయం చేసిందని అందఱూ అనుకొంటున్నారు. నాకళ్ళ ముందు దానింటికివెళ్ళిన వాళ్లు యిద్దరు సన్నాసులైనారు. ఇంక నేను నింపాదిగా వొత్తిగిలాలి. భోగవాళ్ళతో స్నేహం

అల్లరిపాలుకే. ఛీ! యాబ్రాసిముండలలో. యేదో దుకాణం మీద కూర్చుని వెచ్చాలు అమ్ముకొనే నాకు స్నేహమేవిటి? (ప్రకాశము) సూర్యనారాయణగారూ! మీరెందాక వెళ్ళుతున్నారు.

**సూర్య:—** నేనును మీకొట్లుమీదుగనే పోవలయును. రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

రంగము:—[శివశంకరుని గృహము:—శయ్యాతలమున శివశంకరుడు ప్రవేశము.]

**శివ:—** (తనలో) భగవత్కృపవలన సుందరి నాపై మోపిన నేరస్థాపనము నాపైనుండి తప్పిపోయినను, సత్కుల ప్రసూతుండనై నిట్టి దుష్కార్యము లాచరించి నిందలనంది, పెద్దలార్జించి యిచ్చిన ద్రవ్య మంతయును సురాపానమునకును, వేశ్యలకును వెచ్చబెట్టి తుదకు రిక్తహస్తుండనైన నేను జగమున దల యెత్తి యెటు బ్రదుకజాలుదును! ఈ హేయపుబ్రతుకు కన్న మరణమే మంచిది. ఇంక నేనీవిషయమున నాలోచింపనేల? (జేబులోనుండి యొక పొట్లముదీసి) అనాయాస మరణమందుటకు, దగిన విషమును దెచ్చుకొంటిని. (ఎదుటఁజూచి) అదిగో! నాభార్య సంపూర్ణ నిద్రావస్థ నున్నది. ఈమె మేల్కాంచినచో నాయుద్యమమునకు భంగము గలుగును. కావున నన్యాలోచనములు మదిం బెట్టుకొనక శీఘ్రముగ నీయౌషధమును నీటం గలిపి పుచ్చుకొందుగాక.

(గ్లాసున నీరుబోసి యందు మందువైచి సత్యవతినిఁజూచి)

సతీమణీ! "సాధ్వి" యను పేరు నీకే తగియున్నది. నే నెట్టి

దుష్కార్యము లాచరించుచుండినను, నాయందు బరమానురాగవై మెలంగుచు, మదీయ చరణ దాస్యముసేయుచుఁ గృతార్థవైతివి. నేనే నీయెడల నిరాదరభావమువహించి పాపమార్జించితిని.

శా. శ్రీరంజిల్లెడి గొప్పవంశమున వా ♦ సిన్ జన్మముంగాంచి, యిం
పారన్ నాకు.................................
యారూఢిన్ బరిచర్యఁ జేసితివి యా ♦ హా! నీకునున్ నాకునున్
దీరెంబో ఋణమీదినంబునకుఁ ద ♦ న్వీ, నేను నిర్భాగ్యుఁడన్.

సాధ్వీమణీ! నేను జేసినయకార్యములకు నాపైఁబడిన నింద మోయఁజాలక నిన్నువిడిచి దిగంబలంకరించుచున్నాను. నీవు నాకొనర్చిన మేలును నే నెన్నిజన్మములకయినను దీర్పజాలను. అకారణముగ గారాగృహమునఁబడ, నా మితుండగు ముకుందశాస్త్రిని బ్రతిమాలుకొని నన్ను విముక్తునిఁ జేయించుటకు యత్నించితివి. (చేత విషము బట్టుకొని యాలోచించుచుండును.)

సత్య:—(లేచి) నాధా!

శివ:—(తొందరపడి చేతిలోగ్లాసు క్రిందపడ వేయును.)

సత్య:—నాధా! ఏమది. (చూచి) ఈకాచపాత్రయేమి? మద్యమా యేమి? (కాదు పరికించి) కాదు. కాదు. క్షమింపుము.

శివ:—రమణీ! ఇంక నన్ను వారింపకుము. నాకీబ్రతుకుపై రోతపుట్టినది. ఇదినీవు మద్యముగా భావించితివి గావున, నిశ్చయము జెప్పుచుంటిని నేను స్వర్గపురప్రయాణమునకుఁ బ్రయత్నము సేయుచుంటిని.

సత్య:—హా! నాధా! ఎంతదారుణకార్యము సేయఁదలంచితివి. ఈనిర్భాగ్యురాలికట్టి చింతగూడ గూర్పదలంచితిరా? నేనీ సమయ

మున మేల్కొనక యుంటినేని, నాకొంప గూలియేయుండును గదా! ఇంత సాహసకార్యము సేయుటకు మీకేల బుద్ధిపొడమెను?

శివ:—ఇట్టి నిందంబొంది జీవించుటయే కష్టము. ఇంతవఱకును మహాభాగ్యములతో దులదూగిన నేనిట్టి దారిద్ర్యమునుబొంది యెట్లు జీవింపగలను?

సత్య:—ఇదియా మీకు(గల్గినచింత! ప్రాణేశ్వరా! జరిగినదానికై విచారింపవలదు. మీరుమద్యపానమునకుపయోగించుటకు జేయించిన సువర్ణపాత్రి నాయొద్దనున్నది.

శివ:—ఏమీ! సువర్ణపాత్రికూ! అది యెవ్వరో యపహరించిరికదా.

సత్య:—నాథా! మీకు( బ్రియముగూర్చుటకు నేనేహరించితిని (పెట్టె నుండి తీసియిచ్చును.)

శివ:—రమణీ! ఇదియొక్కటి మిగిలినదా!

సత్య:—నాథా! గతించిన విషయములగూర్చి విచారింపవలదు. ఈసువర్ణపాత్రివలనవచ్చు ధనమువలన మీ రెట్టివ్యాపారమును జేసినను జేయవచ్చును. ఈగృహము నాపేరనున్నను మీయదియే యని భావింపు(డు. మనకావంతయు గొఱంతయుండదు. మీ పదసేవజేయుచు నేను కృతార్థురాలనయ్యెదను.

శివ:—(సువర్ణపాత్రతీసుకొని) హా! సురాపానమా! నీవెంత చేసితివి?

సీ. విత్తంబు నార్జింప • వెనువెంట(దిరిగెడు
కుమతులతో మైత్రి • గూర్చినావు
పెద్దలార్జించిన • విత్తమంతయు క్రమ
క్రమముగా బో(జేసి • గ్రాలినావు

అగ్నిసాక్షిగఁగొన్న ♦ యర్ధాంగి వగవంగ
వేశ్యపాల్గావించి ♦ వెలసినావు
నిజకులాచారంబు ♦ నీరుగా గావించి
మర్యాదనంతయు ♦ మాపినావు
తే. గీ. చేయవలసిన పనులన్ని ♦ చేసినావు
లేనిపోని నిందలను గ ♦ ల్పించినావు
భళిర ! మద్యమా యేమంచుఁ ♦ బలుకువాడ
నిన్ను దరిజేర్చవచ్చునే ♦ నిజము దలఁప.

సత్య:—నాధా ! ఇంకదీనికై విచారింపకుఁడు పశ్చాత్తాప చిత్తులగు భగవంతుఁడు మిమ్మనుగ్రహింపఁ గలఁడు.

శివ:—సాధ్వీ నాచిత్తమును మరణోద్యోగమునుండిగూడఁ దప్పించి తిరిదుర్వినియోగము సేయుటకు జేయించి పోయినదని దలంపఁబడి నీచేతిదాచబడిన యాసువర్ణపాత్రయే మనజీవనోపాధికి మార్గమగు గాక ! సురాపానమున కలవాటుపడిన వాడును, వేశ్యలను మఱగినవాడును నిట్టిస్థితికే వత్తురుగదా ! ఓ సంఘసంస్కరణపరాయణులారా ! ఈమద్యపానము జనులచే మాన్పించుటకు మీరు యత్నింపుఁడు. దీనివలన నెన్నిగృహములు మన్నులోగలిసినవి ? ఎందఱు హృద్రోగముల పాలైనశించిరి. ఎందఱి గౌరవంబుమంటినది.

సీ. పరమాత్మజూడంగ ♦ సురను సేవించుటే
మార్గంబనుచు బల్కు ♦ మహితులార
దీనిసేవించిన ♦ జ్ఞానియై యొప్పునం
చును వేడ్క వచియించు ♦ జనములార

పోరాటములయందు ♦ బొమిషంబిది యిచ్చు
నని చెప్పుచుండెడి ♦ యనఘులార
చిత్తంబుజలియింప ♦ జేయక సంతోష
మునుగూర్చునని పల్కు ♦ పుణ్యులార

తే. గీ. దీనిచేతనుగౌరవ ♦ హానియు ధన
హానియును బ్రాణవానియు ♦ నగుటనిజము
ననుభవమునిూడఁ జెప్పితి ♦ నార్యులార
వలదు మద్యపానము సేయ ♦ వలదు వలదు.

(భార్యంజూచి) సతీ! ఇప్పటికినేను పశ్చాత్తాప చిత్తుండనైతి. ఇంక నీ సువర్ణపాత్రపైవచ్చు ధనమును బయాత్రగిడవుచు భగవంతు నమ్మియుందము. ఇంత నేమికావలయును.

సత్య:—నాథా! నీవు పశ్చాత్తాప చిత్తుండవైతివి. ఇంక నాకేమి కావలయును. అయిన నిట్లగుగాక.

తే. గీ. వేశ్యసంఘంబు నిర్భాగ్య ♦ స్పర్శవిడచి
కలితధర్మమార్గంబును ♦ గాంతురిగాక
మానవుల బిల్చు నీసుగా ♦ పానమెలమి
యవనినూరుపేరును లేక ♦ యడగుగాక!

(నిష్క్రమింతురు.)

సంపూర్ణము.

# సంపూర్ణ భారతము.

(గ్రంథకర్త:-పింగళి వెంకటనరసయ్యగారు.)

మహాభారతకథయంతయు నొక్కరాత్రిప్రదర్శనమునకు వీలుగ నుండునట్లు, నూతనపద్ధతులతో క్రొత్తప్లాటుగా వ్రాయబడిననాటకరాజశిరోభూషణము. పద్యములన్నియు రత్నములే. పాండవజననము, ద్రౌపదీస్వయంవరము, మయసభ, ద్యూతరంగము, ద్రౌపదీవస్త్రాపహరణము. సైంధవపరాభవము ఉత్తరగోగ్రహణము, శ్రీకృష్ణరాయబారము, శ్రీకృష్ణుడు చక్రముధరించి భీష్మునిపైకి రథముపైనుండి లంఘించుట పద్మవ్యూహము, అభిమన్యునిమరణమునుగూర్చి ధర్మరాజువిచారము, సైంధవవధ, కర్ణవధ, దుర్యోధనునిపరితాపము, దుర్యోధనుడు మడుగులోదాగుటయు, భీమదుర్యోధనులగదాయుద్ధము దుర్యోధనుడు గూలుట, ధర్మనందనుని పట్టాభిషేకము. పాండవ స్వర్గారోహణము మొదలైనవి విపులముగావ్రాయబడినవి. యిదివరకు ప్రచురపడెడు భారతములవలె గాథగాలేకక్లుప్తముగాను వివరముగాను ఒక్కరాత్రి ప్రదర్శనమునకు వీలుకలుగులాగున వ్రాయబడినది. ఈగ్రంథమును చదివిచూచిన వైవర్ణనమునకు సరిగానున్నదని చదువరులే గ్రహించగలరు. ౩౩ చక్కని సాంగ్సుగలవు. వెల రు 1—4—0 మాత్రమే.

# శ్రీమదాంధ్రభగవద్గీత.

పద్యకావ్యము వెల రు 1—0—0.

కడప మేజస్ట్రేటు తాడూరి లక్ష్మీనరసింహ పండితరాయవిరచితము. శ్లోకార్థసప్రధానము, ప్రతివారు పఠింపదగినది. ప్రతియింటనుండదగినది.

వలయువారు:— శ్రీరామకృష్ణాబుక్కుడిపో,

ఏలూరు, కృష్ణాజిల్లా

# ఆంధ్ర గ్రంథములు.

| | |
|---|---|
| భక్త కబీర్ హ॥ క॥ | రు 1-0-0 |
| పాదుకా పట్టాభిషేకం హ॥ క॥ | 1-0-0 |
| కనకతార ము॥ చం॥ | 0-14-0 |
| వేడుక పెండ్లిపాటలు | 0-8-0 |
| సంపూర్ణ భారతము వి. తెం. | 1-4-0 |
| సుమతీదేవి | 1-0-0 |
| మారుతీ విజయము | 1-0-0 |
| మహిళా మనోరంజని | 0-6-0 |
| పురూరవ | 1-4-0 |
| సతీ సక్కుబాయి | 0-6-0 |
| వైరాగ్య సుధానిధి | 0-6-0 |
| సతీ తులసి | 1-4-0 |
| గరుడోపాఖ్యానము | 0-8-0 |
| ప్రసన్నయాదవము | 0-8-0 |
| పారిజాతాపహరణం | 0-8-0 |
| చతుర చంద్రహాస | 0-8-0 |
| శ్రీకృష్ణ రాయబారం హరికథ | 0-8-0 |
| సీతా కళ్యాణం డిటో | 0-8-0 |
| పాదుకా పట్టాభిషేకం డిటో | 0-8-0 |
| సుభద్రా పరిణయం | 0-8-0 |
| సావిత్రి అ. నా. | 0-12-0 |
| జయప్రద హరికథ | 0-8-0 |

## నవలలు.

| | |
|---|---|
| ఆంగ్లరాజ్య స్థాపనం | రు 2-10-0 |
| యుగంధర విజయం | 2-4-0 |
| కాళిక | 1-0-0 |
| మానసింగు | 1-8-0 |
| ప్రచండ భైరవము | 0-12-0 |
| పూ॰ ప్రతిక్రియ | 1-4-0 |
| కుసుమ | 1-0-0 |
| ధరణికోట | 1-4-0 |
| మనకీదారిద్ర్యమేల అను భారతవర్ష ఆర్థిక చరిత్ర | 1-4-0 |
| బృహస్వాస్థ్యం | 1-0-0 |
| వచన భూషణం | 0-12-0 |
| మృత్యుంజయ విలాసం | 0-8-0 |
| గోపాలకృష్ణ గోఖలే చరిత్ర | 0-10-0 |
| సింహప్రభు | 0-12-0 |
| శ్రీరామ వశిష్ఠ సంవాదం | 0-8-0 |
| పురాణేతిహాస సా॥ సంగ్రహం | 1-0-0 |
| డిటో 2-వ భాగం | 1-0-0 |
| హాస్యపు పాటలు | 0-6-0 |
| ఆంధ్ర భగవద్గీత | 0-8-0 |
| కర్ణ భాగము | 0-4-0 |

ఈ పుస్తకములే గాక యింకే పుస్తకములు కావలసినను యీదిగువ చిరునామాకు వ్రాయుడు.

